# మెట్టవేదాంతం-1

ఒకప్పుడు నావల్ల అంత ఉపకారం పొందిన దామోదరుడే ఆఖరికి ఇలా చేశాడేమిటి! ఇలా నామాదిరిగా చాలామంది, స్వజాతీయుల మూలాన చిక్కులుపడి ఉండవచ్చును. ఇప్పుడు నేనూ అలాంటి చిక్కులో పడ్డాను. బహుశా నేనుకూడా ఎప్పుడన్నా ఇతర్లను ఇలాంటి చిక్కుల్లో పడేసి ఉండవచ్చును. ఇలా జరగటం అసంభవమూ కాదు; అచింతనీయమూ కాదు. ఇంతకాలంనుంచీ మానవసమాజంలో ఉంటున్నప్పుడు మనస్సు కొంచెమైనా రాయి కావలసింది కాని, చిత్రమేమంటే ఇంత మోసపడ్డప్పటికీ మనస్సులోని మార్దవమేమీ తగ్గలేదు; లేక అహంకారం చావలేదనవచ్చు!

దామోదరుని కృతఘ్నతకు నా మనస్సు కలతచెందింది. వాడు నాకు బంధువు. ఒకప్పుడు వాడు కష్టాల్లోపడటం చూసి నాకు జాలికలిగి నా ప్రియమిత్రుడైన ప్రాణకాంతుని ప్రావిడెంటు ఫండులోనుంచి యుక్తిగా-అంటే, కొంత వంచనకూడా ఉంది-అప్పుతెచ్చి వాడికి అడ్డుపడ్డాను. అప్పుడు అలా అడ్డుపడటంలో ఎంత ఆత్మానందం కలిగిందో నాకు ఇప్పుడుకూడా జ్ఞాపకమున్నది. దామోదరుడు మళ్ళీ సకాలానికి డబ్బిస్తాడు; కొసరుగా వేనోళ్ళతో నాకు కృతజ్ఞతకూడా తెలుపుతాడని మూఢుడి మాదిరిగా విశ్వసించాను. ఇప్పటికి అసలుసంగతి ప్రాణకాంతునికికూడా తెలిసింది. స్వభావానుగుణంగా అతను నన్ను ఎత్తిపొడవటమే కాకుండా అప్పుడప్పుడు మందలిస్తున్నాడు కూడా! ఏవిధంగానైనా సరే నేను ప్రాణకాంతుని డబ్బు ఇవ్వవలసిందే. 'ఏవిధంగానైనాసరే' అని పైకి అంటున్నాను కాని అసలు తీర్చటానికి ఉన్న మార్గమల్లా ఒక్కటే; భార్య నగలు. ఇప్పుడావిడ ముసలిదైంది. నగలతో అవసరంకూడా లేదు. బహుశా, అవసరం లేకపోవటంకూడా అవసరానికి కారణం కావచ్చును. భార్యను ఎలా మభ్యపెట్టి నగలు చేజిక్కించుకోవాలో నాకు తెలియలేదు. నాకిది ఒకసమస్య అయి కూర్చుంది. ఇప్పుడు నేను ముసలివాణ్ణి కావటంచేత భార్యను సమ్మోహింప చేయగలిగిన అస్త్రాలు

రెండూ పనికిరాకుండా పోయినవి. ఒకటీ యౌవననూ - రెండు సంపాదించే శక్తీ, పోనీయండి, ఈ గొడవ. మళ్లీ నేను దామోదరుని సంగతికి వస్తాను.

దామోదరుడు నాకు తిరిగి డబ్బివ్వలేదు. ఇవ్వకపోవటమే కాకుండా, వాడు ఉత్తేజితుడై మునివేళ్ళమీద నిలబడి వాళ్ళావీళ్ళదగ్గర నన్ను అనకూడనిమాటలు అంటూ, అపవాదులేస్తూ తిరుగుతున్నాడు. నేను నిష్పంటి వాడినని చెప్పను. కాని దామోదరుడిలా ప్రవర్తించటం అన్యాయం. అటువంటివాణ్ణి, గొంతుమీద కాలువేసి తొక్కి, బయటకువచ్చిన నాలుకను మొదలంటా కోసి, సలసలకాగే చమురులో పారవేసినా పాపం లేదు. కాని గవర్నమెంటుచట్టమూ, ఇప్పటి నా మనఃప్రవృత్తీ ఈపనికి అనుకూలంగా లేవు. వృద్ధాప్యంవల్లనైనా కానీయండి - లేక, నా ఆధ్యాత్మికశక్తి ఎక్కువ కావడంవల్లనైనా కానీయండి - పూర్వం ఏఘటనలైతే నాలో ప్రతిహింసనూ, రోషాగ్నినీ ప్రజ్వలింపజేసేవో ఇప్పుడవే నాకు వేదాంతమార్గం చూపిస్తున్నవి. దామోదరుడు చేసిన పనికి నేను కుపితుడనైనమాట వాస్తవం. కాని వాడే ఈ రచనకు కావలసిన సామగ్రి ఇవ్వటంచేత వాడిమీద ఒక విచిత్రమైన కృతజ్ఞత కలుగుతున్నది.

మానవుని మనసు చిత్రమైంది!

* * *

దామోదరుడు ఇలా ఎందుకు చేశాడు? ఎవరికైతే ఉపకారం చేశానో వాడే ఇలా నడుంకట్టుకుని నామీద ఎందుకు తిరగబడాలి? ఈ కృతఘ్నత ఏ 'సైకాలజీ'కందికి వస్తుంది? కాని అందరూ ఇలా చేయరే! చాకలి వెంకాయికి నడుంనొప్పిగా ఉంటే నాలుగు హోమియోపతీ మాత్రలు ఇచ్చాను. నా తెలివితేటలవల్ల కాకపోయినా నాడినొప్పి ఎలాగో పోయింది. ఇది జరిగి చాలాకాలమైంది. కాని వాడు నాకిప్పటికీ కృతజ్ఞత చూపిస్తాడు. మొన్నకూడా తట్టలో పెట్టుకుని వాలుగచేప తెచ్చిఇచ్చాడు. దానిడబ్బు విలువ తక్కువే కాని అందులో ఉన్న ప్రేమ!

ఇంకోసంగతికూడా జ్ఞాపకం వస్తున్నది. చాలాకాలం కిందటిదీ. అప్పుడు నేను రాదాంబంగళాలో ఉన్నాను. చలికాలం. ఆవాళ సాయం

త్రం కొంచెం తుంపరకూడా పడసాగింది. ఇలాంటి చలిలో కావలసిన వస్తువులన్నీ నా ట్రంకులో ఉన్నవి. తీసి ఒక్కొక్క మెట్టే ఎక్కుదా మనుకొన్నాను. కాని మొదటి మెట్టుకే అంతరాయం వచ్చింది!

నేను స్టౌ వెలిగించి ఒకకప్పు స్ట్రాంగ్ కాఫీ కాచి తాగబోతూ ఉండగా బూట్లు టకటకలాడిస్తూ దొర వచ్చాడు. దొర వానకు తడిశాడు. రాగానే నౌకరుకు టీ తయారుచేయమని ఆర్డరిచ్చాడు. నౌకరు సలాం చేసి 'ఇవ్వాళ కొట్లన్నీ మూసివేశారు, టీకి కావలసిన సరంజాము దొరక'దని మనవిచేశాడు.

తర్వాత మాటల సందర్భంలో ఈ దొర మామూలుదొర కాదనీ, డిస్ట్రిక్టు మేజిస్ట్రేటని తెలుసుకున్నాను. ఒక మైలుదూరాన మోటారు చెడటంవల్ల ఇంతమార్గం నడిచివచ్చాడట! ఇక నాలో ఉన్న మర్యాదంతా ఒక్కమాటు పొంగింది. చాలా వినయంతో–"తమరొక కప్పుకాఫీ స్వీకరిస్తే నేను కృతార్థుణ్ణి అవుతా"నని అన్నాను. దొర నాకు ధన్యవాదాలర్పించి "మీకంత శ్రమెందుకు? నాకు కాఫీ అక్కర్లేదు!" అన్నాడు. కాని నేను వదలలేదు. ఎలాగో ఒకకప్పు కాఫీ వారిచేత తాగించాను. ఆ తర్వాత, ఇంతకంటేకూడా ఘనమైన పానీయం నాదగ్గర ఉన్నదని సూచించాను. దొర కనుబొమలు ఎగ్గించి—అలాంటిదేవీ తనకు అక్కర్లేదన్నాడు. ఇక ఆరాత్రి నేనుకూడా దానిజోలికి పోలేదు. కాని ఆదొర ఇప్పటికికూడా నన్ను మరచిపోలేదు. ఈదేశంలో ఉన్నంతకాలం నాకేదోవిధంగా ప్రత్యుపకారం చేయాలని నానావిధాల ప్రయత్నించాడు. ఇప్పుడు పెన్షను తీసుకుని వాళ్ళదేశం వెళ్ళిపోయాడు. అయినా, అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూ ఉంటాడు. ప్రతి ఉగాదికీ గ్రీటింగ్స్ పంపుతూ ఉంటాడు. ఒకకప్పు కాఫీతో దొరగారి స్నేహాన్ని సంపాదించగలిగాను.

మరి, దామోదరు డిలా ఎందుకు చేయాలి?

ఆలోచనలో పడ్డాను.

* * *

చాలాసేపు తలగోక్కుని, బుర్రబద్దలుకొట్టుకొని ఆలోచించినవిషయాలను కాగితంమీద పెట్టటానికి సంకోచిస్తున్నాను. 'శతంవద, ఏకంమాలిఖ'

అనే సంస్కృతసామెతకూడా నాకు జ్ఞాపకంవచ్చింది. సంస్కృతంలో ఉన్నదంతా నమ్మవచ్చునని నేను చెప్పనుకాని ఈ మాటమాత్రం చాలా అనుభవంమీద చెప్పిందని నేను ఒప్పుకుంటాను. రాసింది ఎక్కడో ఒకచోట తప్పక ఉంటుంది—మనకి విరుద్ధంగా ప్రమాణమయి కూర్చుంటుంది. ముందు యుగంలో వచ్చే దామోదరులు దీన్ని ఆధారంచేసుకుని ఎగతాళిచేసినా చేయవచ్చు; మన తెలివి తక్కువను అందరికీ ప్రదర్శించనూవచ్చు! ఒక రాతనుకానీ, ఒక మాటనుకాని ఆధారంచేసుకుని ఒక వ్యక్తిని విమర్శించ బూనటం దూరదృష్టిని సూచించదు. (ఇక తెలివి తక్కువ అనే పదాన్ని వాడను) మనిషి మేఘంమాదిరిగా ప్రతిక్షణమూ మారుతూ ఉంటాడు. మనం అందులో ఏదో ఒక రూపాన్ని తీసుకుని విమర్శించటానికి పూనుకుంటే పొర్లపడతాము.

కాని, నేను అసలు సంగతి వదిలి ఇంకోదాంట్లో పడ్డాను. ఇదే మనలో ఉన్న దోషం. 'టు ది పాయింట్'-మాటాడటం చేతనైతేనా ఏపనీ చేయము. పల్లిని నలపటానికి సదుంబిగిస్తాము; దోమను చంపటానికి తుపాకి తీస్తాము.

దీన్ని పోనివ్వండి. ఇక అసలువిషయానికి వస్తాను. నేను ఆలోచించి తేల్చిందేమంటే, దామోదరుని తరగతికి చెందిన వ్యక్తులకు ఉపకారం చేయబోయి మనకు తెలియకుండానే వాళ్ళను అవమానిస్తున్నాము. అందుచేతనే వాళ్ళ ఆత్మ-అభిమానం మీలుచిక్కగానే బుసలుకొడుతూ లేస్తున్నది. దీన్ని ఇంకా కొంచెం విశదంగా చెప్పతాను.

దామోదరుడూ నేనూ ఒకేతరగతికి చెందిన వ్యక్తులము. ఘటనా చక్రం పెడతిరగటంవల్ల వాడు యాచకుడూ నేనూ దాతనూ అయ్యాను. ఈచక్రమే వాడికి అనుకూలంగా తిరిగితే వాడిస్థానంలో నేను ఉండవలసివచ్చేది. ఈ ఘటనాచక్ర మహిమవల్ల ననుకోండి, లేక గ్రహాల కుట్రవల్ల ననుకోండి, లేకపోతే పూర్వజన్మసుకృతంవల్ల ననుకోండి, వాడు నన్ను యాచించవలసివచ్చింది ఇక నేను మహాఆడంబరంతో [అంటే అప్పుచేసికూడా] వాడు చాపినజోలెలో బిచ్చంవేశాను. నిజానికి నేను చేసిందేమిటో ఎరుగుదురా ? వాడి ఆత్మాభిమానాన్ని కాలితో రాచాను. నోటితో అనకపోయినా చేతితో చేసిచూపాను : 'ఒరే అధమయాచ

కుడా! పాపం నువ్వుచాలా కష్టాల్లోపడ్డావు. నాదగ్గరవాడివి. ఇలారా, ఒక గుప్పెడుగింజలు వేస్తాను. జాగ్రత్త, జోలెను గట్టిగా పట్టుకో!' అని.

యాచకుడప్పుడు పైపై కృతజ్ఞతచూపటానికి పళ్లు ఇకిలించాడే కాని వాడిఅంతరంగంలో ఉన్న మనిషి అవమానాగ్నిలో దహించుకుపోయాడు. దానికే ఇప్పుడు బదులు తీర్చుకుంటున్నదికూడా. ఈ ఉపకారం వాడికి కంపపెట్టుగా తోచటానికి కారణం, వాడూ, నేనూ ఒకతరగతికి చెందటమే. వాడిస్థానంలో నేను ఉండకపోవటమే వాడిక్షోభకు కారణం. నవ్వుతూ అప్పివ్వటంకంటే నేను వాణ్ణి వేరే ఏమి అవమానించాలి? పరీక్షలో తప్పిన విద్యార్థి పాసయిన కుర్రవాణ్ణి మనస్సులో ప్రేమిస్తాడా? ఉద్యోగం దొరికినవాణ్ణి నిరుద్యోగి తనకు తెలియకుండానే ద్వేషిస్తాడు. గెలిచినవాడికీ ఓడినవాడికీ స్నేహం పొసగదు. ఈకారణంవల్లనే పోషింపబడేవాడు పోషించేవాడిని తిడుతూఉంటాడు. అసమర్థసోదరుడు సమర్థసోదరునివద్దసహాయంపొందుతూకూడాఅసంతృప్తిగానే ఉంటాడు; ఎప్పుడూ తప్పులు వెతుకుతూ ఉంటాడు. అందుచేతనే ఘటనాచక్రంలో అడుగున పడిపోయినవాళ్లు ఉన్నతిలోఉన్న తమతరగతివారిని మంచి చూపు చూడరు. ఇక అలాంటివాళ్ళదగ్గిరికి సహాయానికి పోవలసివస్తే చచ్చిపోతారు. అంటే ప్రాణాలు పోతవనికాదు. లోలోపల ఉడికిపోతారు. ఆ ఉడుకు అప్పుడప్పుడూ తిట్లరూపంలో బయటకూడా పడుతూఉంటుంది. వీళ్ళల్లో పెద్ద మనుష్యులు—అంటే, పాలిష్అయినవాళ్లు—చప్పున బయటపడరు. శివుడు విషాన్ని కంఠంలో దాచుకున్నట్టుగా వీళ్ళూ క్రోధాన్ని దాచుకుని తియ్యని మాటలతోనూ, విషపునవ్వుతోనూ వెల్లడిస్తూఉంటారు.

కాబట్టి, తమతరగతి వ్యక్తులకు ఉపకారం చేయదలచుకుంటే బహిరంగంగా చేయకూడదు; చాటుగా చేయటమే మంచిది. కుడిచేతితో ఇచ్చినట్టు ఎడమచేతికి తెలియకూడదు. తెలిసిందాఅంటే మీవల్ల ఉపకారం పొందినవాడు మీకు శత్రువయి కూర్చుంటాడు. నీ నవ్వు డొక్కచింపేస్తుంది... బుర్రంతా పాడుచేసుకుని 'వీడు నావల్ల ఉపకారంపొందికూడా శత్రు

వెందుకయ్యా'డని ఆలోచిస్తూకూర్చుంటావు. బహిరంగంగా సహాయం చేయటంవల్లనే ఈఫలితం సంభవించింది. ఈఫలితంకూడా స్వాభావికమైనదే!

వెంకాయ నాతరగతివాడు కాడు. వాడిజాతి ఎంతోకాలంనుంచి మన జాతికింద అణగి పడిఉన్నది. అందుచేత వాడి మనస్సులో ఏమీ కష్టంకలగలేదు. నాసహాయం కృతజ్ఞతతోనే స్వీకరించాడు—పెద్దవాళ్ళదగ్గరనుంచి పిల్లలు బహుమతులు తీసుకున్నట్టుగా. వెంకాయ నాసమకక్షి కాడు; కావాలని స్వప్నంలోకూడా అనుకోడు. వాడు అనుకున్నరోజున ఈసమస్యవచ్చి తీరుతుంది. బహుశా ఆరోజులుకూడా దగ్గరికివచ్చినవనుకుంటాను. అలాంటి పరిస్థితుల్లో వాడిమీద ఇప్పటిమాదిరిగా దయచూపించటానికి వీలుండదు!

దొరకూడా కృతఘ్నుడు కాకపోవటానికి కారణం ఉన్నది. దొర కాఫీ తాగి కృతార్థుడైనదానికంటే కాఫీ ఇచ్చి నేను ఎక్కువ కృతార్థుడనైనాను. అంటే, ఆవాళ నేను వానలోతడిసి చలిగొన్నవ్యక్తికి కాఫీ ఇవ్వలేదు; ఒక దొరకుఇచ్చి ధన్యుడనైనానని తలచాను. అతనితోపాటు తడిసిన నౌకరు సంగతి నేను ఆలోచించనే లేదు! కాబట్టి, దొరనిగాదు నేనేమీ దయతలచలేదు. దొరే నామీద దయతలచాడు. నిజానికి కృతఘ్నుడను కావలసింది నేను. యథార్థం చెప్పవలసివస్తే అయినానుకూడా! వ్యక్తిగతంగా ఆ దొరమీద కాదు; మొత్తం దొరజాతిమీద. వాళ్లు మనమీద దయతలిచే మనంఇచ్చిన కాఫీ తాగుతున్నారు; బదులుగా వీపు చరిచి ధన్యవాదాలిస్తున్నారు. అనేకవిధాల మనకు ప్రత్యుపకారం చేయాలని ప్రయత్నిస్తున్నారు. ఇదే నేను సహించలేకపోయాను. అంటే, ఇంగ్లీషువాళ్ళ విషయంలో మనమంతా దామోదరుల మన్నమాట. ...కాబట్టి—చింతాప్రవాహం ఇంకోదోవ పట్టింది.

ప్రాణకాంతుడు మట్టిపిడత చేతపట్టుకువచ్చి కుర్చీలాక్కుని నాదగ్గర కూర్చుని "ఇంట్లో పాతబియ్యం ఉన్నవా?" అన్నాడు పిడతకింద పెట్టుతూ. "ఉండవచ్చు-ఎందుకు?" అని అడిగాను.

"అయితే, ఈకాయితం తీసుకెళ్ళి బియ్యంలో పెట్టు-బాగా లోపల" అని జేబులోనుంచి కాయితం తీశాడు.

"ఏమి టది?"

"ప్రోనోటు. చదివి చూడు."

తీసుకు చదివాను. 'దామోదరుడు ప్రాణకాంతుని దగ్గర నూటికి నెలకు అర్ధరూపాయి వడ్డీచొప్పున పదిహేను వందలరూపాయలు అప్పు తీసు కున్నాడు. నాకు ఆశ్చర్యంవేసి–"సంగతి ఏమిటి?" అని అడిగాను.

"నోటు ఫోర్జరీది దామోదరుడిదగ్గరనుంచి మనం డబ్బు వసూలు చేసుకోవాలిగా. అందుచేత దీన్ని బియ్యంలో పెట్టితే పాతనోటుగా కనపడు తుంది. ఇది బాగా అనుభవం ఉన్నవారు చెప్పినమాట."

"ఫోర్జరీదా?"

"సంతకం ఫోర్జరీ కాదు; దామోదరుడు చేసిందే. ఒకణ్ణి బాతిపెట్టి దామోదరుణ్ణి బాగా తాగించి తెల్లకాయితంమీద సంతకం చేయించాము. మిగతా విషయాలు పూర్తిచేసింది ఇంకొకడు." నేనేమీ మాట్లాడలేదు.

"రెండు మాసాలు ఆగి దావా చేద్దాము. ఈమధ్యని నువ్వు డబ్బు కోసం తొందర చేస్తూ ఉండు." అన్నాడు మళ్లీ ప్రాణకాంతుడు. నేను ఆమోదించకపోవటం చూసి ప్రాణకాంతుడు కొంచెం చీకాకుతో ఇలా అన్నాడు:

"నీ వేదాంతం గీదాంతం కట్టిపెట్టు. దీనితో నువ్వు మునిగేది కాకుండా నన్నుకూడా ముంచావు. 'శఠే శాఠ్యం సమాచరేత్' కూడా తీసివేయాల్సిన వేదాంతం కాదు. చాణక్యుడు తెలివితక్కువవాడు కాదు. పాము నెత్తిన కర్రతో కొట్టటం పూర్వంనుంచీ వస్తున్న ఆచారం. కొడదామా వద్దా అని ఆలోచిస్తూ కూర్చుంటే అదే నిన్ను కరిచి చంపుతుంది. కాబట్టి, వెంటనే ఈ కాయితం తీసుకెళ్ళి బియ్యపు పీపాలో పెట్టు. దామోదరుడనే సర్పాన్ని వశ్యం చేసుకునే మంత్రం ఇదే."

నేలమీద పెట్టిన పిడతలోనుంచి ఎర్రలు పైకి ఎక్కివస్తూఉన్నవి. వాటిని లోపలికి నెట్టి పిడతమీద మూత వేసి, ప్రాణకాంతుడు మళ్ళీ చెప్పసాగాడు:

"చూడు! ఈ ఎర్రలూ, చేపలూ రెండూ అమాయకప్రాణులే. వీటిని సృష్టించిననాడు మనలోకూడా వీటిగుణాలు పెట్టాడు. దామోదరుడనే పెద్దచేప ఇలాంటి చిన్నచిన్న ఎరలకు పడదు. గాలంకూడా మింగివేస్తుంది.

కాబట్టే ఈ పెద్దవల వేయవలసివచ్చింది! నువ్వింక వెనకా ముందూ చూడకు. కాయితం తీసుకెళ్ళి బియ్యంలో పెట్టు."

"ఏగా ఇంట్లో బియ్యపుపీపా లేదా?"

"ఎందుకులేదూ? దానిపక్కనే భార్యకూడా ఉంగి. ఆవిడని ఉల్లంఘించి పీపాదగ్గరకు పోవటమంటే హిమాలయపర్వతాలుదాటి టిబెట్టు పోవటం అన్నమాట! ఆవిడకు అంతా విప్పిచెప్పటానికికూడా వీల్లేదు. దైవభయం జాస్తి. వింటే గోలచేస్తుంది. ఇంతకాలంనుంచీ కాపురం చేస్తూఉన్న ఆవిడతో—ఇక ముందు కూడా చేయవలసిన ఆవిడతో—పేచీ పెట్టుకోవటం మంచిది కాదు; సుఖం ఉండదు. పైగా ఈ సంగతి ఆవిడకి తెలిసిందంటే నామీద వున్న గౌరవం తగ్గుతుంది. ఈపని నువ్వే చేయి!—" అని ప్రాణకాంతుడు లేచాడు. నేను "ఎక్కడికి పోతున్నావు?" అన్నాను.

"షావుకారుగారి చెరువుదగ్గరికి. దాంట్లో మంచిమంచిచేపలున్నవట."

నేను కిటికీలోనుండా బయటికి తొంగిచూశాను. మా ఆవిడ కోడలినీ, మనమలనీ వెంటబెట్టుకుని, దొడ్డివాకిలిగుండా బయటికి పోతూ ఉంది. మసుమురాలిచంకలో అకూ–వక్కాడబ్బా ఉంది. ఈ అట్టహాసం చూస్తే ఇప్పట్లో తిరిగిరాదని ఊహించాను.

"ఇక వెళ్తాను, వేళ మించిపోతున్నది." అని ప్రాణకాంతుడు మందహాసం చేస్తూ వెళ్ళిపోయాడు.

కాయితం చేతపుచ్చుకుని మళ్ళీ ఆలోచనలో పడ్డాను... ఈ వృద్ధాప్యంలో ఘోర్దరిః సహాయపడవలసిందేనా? దామోదరుడు డబ్బుతీసుకు పోవటం నిజమైనా ఈనోటు తప్పేమది కదా! పదిహేనువందలు ఏమంత ఎక్కువ! ఈ డబ్బుకోసం నేను సత్యాన్ని చంపవలసిందేనా?— నావివేకం సత్యంవైపుకే మొగ్గుతున్నది. గాఢచింతలో మున్నిడనయాను.

* * *

నాకు చైతన్యం కలిగి చూసేసరకు నోటుతీసుకువెళ్లి బియ్యపుపీపాలో పెట్టుతున్నాను. ఈపని చేయటం వెధవ పదిహేనువందల రూపాయిల కోసం కాదు; నామోదరుడు నామీద దుష్ప్రచారం చేస్తున్నాడనే.

నాకు ఆత్మసాక్షాత్కారమైంది!

# మెట్టవేదాంతం-2

పిల్లలు ఇంత బాగా ఉంటారు, ఎందుకని?

ప్రస్తుతం, నా మనమడు నా మనస్సులో ఈ చింతనను రేకెత్తించాడు. వాడి కిప్పుడైదోయేడు. వాడి సేవలోనే నాకు పొద్దుపోతూ ఉంది. ఇంకో పని చూడటానికి తీరిక లేదు; కాయితాలతో పడవ చేయటమో, ఓడ చెయ్యటమో, సిరాబుడ్డి చేయటమో, గాలిపటం చేయటమో! ఇంతే కాదు, వాణ్ణి నా భార్యకు కాల్పనిక ప్రియుణ్ణిగా చేసి వాడితో ఉత్తుత్త పోట్లాట కూడా పోట్లాడతాను. కుర్రవాడు శిష్టుడు కాడు; శాంతుడు కాడని వేరే చెప్పడమెందుకు?

వాడు ఈమధ్యనే హుక్కా బోర్లదోశాడు. చిలుకను పగులగొట్టాడు. కేసులోనుంచి కళ్లజోడు తీసుకోవాలని రోజుకు పదిసార్లన్నా ప్రయత్నిస్తాడు. దుమ్ములో పొర్లాడి వచ్చి నా మెడలమీదా వీపుమీదా ఎక్కుతాడు. పక్కగుడ్డలన్నీ ఖరాబు చేస్తాడు.

ఇన్ని చేసినా నేను వాడిమీద కోపించలేకుండా ఉన్నాను. మధ్య మధ్య ఎప్పుడన్నా గద్దించినా, అందులో పటుత్వం లేదని అప్పుడే తెలిసిపోతుంది. పోకిరీ వెధవ నవ్వుతాడు! నేనుకూడా వాడితో కలిసి నవ్వుతాను.

న్యూస్ పేపరు రావటం భయం, భుక్తం చేసుకుంటాడు. కాస్తో కూస్తో చించుతాడు. పత్రికలో బొమ్మలు చూపుతూ, సంగతి సందర్భాలు లేకుండా ప్రశ్నలు వేసి నా దుంప తెంచుతాడు. వాడికి ఏదో ఒకటి చెప్పి మభ్యపుచ్చుతానే కాని, నా అల్పజ్ఞతకు నాలో నేను సిగ్గుపడుతూ ఉంటాను. ఈ అమాయక ప్రశ్నలు ఎంత అమాయకంగా ఉంటాయో అనుభవజ్ఞులకే తెలుసు!

"పత్రికలో ఏముంటై తాతయ్యా?"

"వార్తలు."

"వార్తలంటే?" దీనికి జవాబు చెప్పటం కష్టమయింది—

"నానాదేశాల శాస్త్రాలూ (కథలు) ఉంటై. ఏకీ, ఇలా తే దాస్తాను షోడు చెయ్యకూడదు" అన్నాను.

"ఇంగులోది ఒక శాస్త్రం చెప్పు తాతయ్యా! చూడు, చూడు, అటు చూడు!"

అటు చూశాను. బల్లి పురుగును పట్టుకున్నది.

పురుగు గిలగిల కొట్టుకుంటున్నది.

కుర్రవాడు ఉత్తేజితుడై, పేపరు అవతల పారవేసి బాలీసు ఎక్కి నుంచున్నాడు.

"బల్లి మిడతను పట్టుకుని తింటున్నది" అన్నాను.

కుర్రవాడు ఆశ్చర్యంతో కళ్లు విప్పుకుని కాసేపు అటే చూస్తూ ఉండిపోయాడు, తర్వాత—"బల్లి పాలు తాగదు కదూ?" అన్నాడు.

"ఊహుఁ"

"అన్నం?"

"ఊహుఁ.—అసలు దానికి ఎవరు వండి పెడతారో చెప్పు?"

"దానికి అమ్మ లేదూ?"

ప్రమాదం రావటానికి సిద్ధంగా ఉన్నదని గ్రహించి తెలివిగా ప్రసంగం మార్చాను. 'బాలీసుమీదనుంచి దిగు. మీ అమ్మ చూస్తే కోప్పడుతుంది.'

"బాలీసుమీద నుంచుంటే అమ్మ ఎందుకు కోప్పడుతుంది. మరి నువ్వు కోప్పడవేం?"

బాలీసు మన్ను చేసినందుకు వాడిని కోప్పడదామనుకున్నాను కాని ఈ జవాబు విన్నాక కోప్పడడం నావల్ల కాలేదు. అర్థంలేని వాడితల్లి కోపాన్ని చాటుచేసుకుని బాలీసును కాపాడటానికి ప్రయత్నించాను.

"మీ అమ్మకు బలేకోపం. చూసిందంటే నీకూ నాకూ మూడుతుంది. దిగు, బాలీసుమీదనుంచి."

"అమ్మ ఇప్పుడు పొయ్యింట్లో ఉందిగా!" అని, బాలీసుమీదనుంచి ఒక కాలుతీసి టేబిలుమీద పెట్టాడు—బల్లిని చూడటమే వాడి ఉద్దేశం.

టేబిలుమీద సిరాబుడ్డికి తిప్పలు వచ్చినవని గ్రహించాను. సిరా ఎలానూ ఒలుకుతుంది. బుడ్డికూడా పగిలితే!

ఇక గత్యంతరం లేక శంఖుబాలుడి శాస్త్రం చెప్పి వాడి మనస్సును ఆకర్షించటానికి ప్రయత్నించాను.

పగలంతా ఈవిధంగా గడుస్తుంది.

కుర్రవాడి కేమాత్రమూ సమాధానం చెప్పలేకుండా ఉన్నాను. చెప్పలేక పోతున్నందుకు నాకేమీ కోపం రావటంలేదు; పైగా ఆనందం కలుగుతున్నది! ఎందుకనీ?

* * *

ఒంటరిగా పండుకుని ఆలోచిస్తున్నాను.

ఒయాటీగదిలో నేను ఒక్కడనే పండుకుంటూ ఉంటాను. ఇప్పటి దాకా వాడు నాదగ్గరే ఉన్నాడు; ఇంతకు ముందే వాడితల్లి వచ్చి అన్నం పెట్టటానికి తీసుకుపోయింది. వెళ్ళే ముందు, రాత్రికి నాదగ్గిరే పండుకుంటాననీ, శేషించిన శంఖుబాలుడి శాస్త్రం వింటాననీ చెప్పిపోయాడు.

వాడు వస్తే-నాకు ఏమీ ఆటంకంలేదని వేరుగా చెప్పనక్కర్లేదు. కాని వాడితల్లికి ప్రబల ఆటంకం. అసలు వాడు పక్కలో ఉంది ఆవిడకు నిద్రపట్టదు. కాని ఆసంగతి ఒప్పుకోదు. వేరే కారణం చూపుతుంది.

"వాడు రాత్రిపూట నిద్రలో ఊరక తన్నుతాడు. వాడిని పండుకో పెట్టుకుంటే కుంభకర్ణుడుకూడా జాగరణ చేయవలసిందే!" అంటుంది.

నేను కుంభకర్ణుణ్ణి కాకపోయినా భయపడలేదు. వాడు, రాత్రికి తప్పక వస్తాననీ, తలుపు తీసి ఉంచమనీ చెవులో చెప్పిపోయాడు.

తలుపు తీసి పండుకుని చింతనలో పడ్డాను: పిల్లలు ఇంత బాగా ఉంటారు, ఎందుకనీ?

* * *

నిరపేక్షగా ఆలోచించి చూస్తే, పిల్లలంతా బర్బరులూ అనాగరికులూ, నగ్నపశువులూ అని, ప్రతి బుద్ధిమంతుడూ ఒప్పుకుంటాడు. కాని, ఈ బర్బర, అనాగరిక, నగ్నపశు—స్వభావం కల పెద్దల్ని చూచి మనం సహించకపోవటమే కాదు, ఈ అనాగరికత్వాన్ని, పశుత్వాన్ని అణచివేయటానికి మనం, అంటే నాగరిక సమాజం ప్రతియుగంలోనూ అనేక కౌశలాలు అవలంబించింది. చట్టాలూ, కోర్టులు, జైళ్లు, ఉరికంబాలు, శాస్త్రాలు, ఉపదేశాలు, నీతికథలు, నరకభీతి వగైరాలు. వీటిలో ఏదో ఒక్కటి గానీ, లేక అన్నీ కలిసి గానీ ఈ పశుప్రకృతిని అణచివేయటానికే

ఉపయోగింపబడినవి. మానవ మననూ, మానవసభ్యతలో ఒక ముఖ్య అంగం ఇవే. కాని ఈ బర్బరత్వమే శిశువులలో ఉంటే మనకు ఆనందం కలిగిస్తుంది!

ఎందుకనీ!

కంబళి ముసుగు తన్ని హుక్కా పీలుస్తూ చింతనలో పడ్డాను. చాలా సేపు ఆలోచించినమీదట నేను మళ్లీ యీ సిద్ధాంతానికి వచ్చాను.

శిశువులు అసహాయులు కావటంవల్ల నే వాళ్ళమీద ప్రతి సభ్యమానవుడు అనుకంప చూపిస్తాడు; ఈ అనుకంపే క్రమంగా అనురాగం క్రిందికి మారుతుంది. ఒక్క శిశువుల్నే కాదు, మనం స్త్రీలనుకూడా ప్రేమిస్తాము—వాళ్లని మర్యాద చేయటానికి ఆదుర్దాపడతాము. దీనికూడా, బహుశా వాళ్లు అసహాయులు కావటమే మూలకారణ మనుకుంటాను. అసహాయులనూ అసమర్థులనూ ప్రేమించి, రక్షించి, సన్మానించి సభ్యపురుషులు తమ పురుషత్వాన్ని [పౌరుషాన్ని] సార్థకపరుచుకుంటారు. శిశువులూ, స్త్రీలూ అసహాయులు కాకపోయినట్టయితే, మనం బహుశా వాళ్ళ ఉపద్రవాలను సహించేవాళ్ళం కాము. స్త్రీ పురుషుడైనా, శిశువు పెద్దవాడైనా—ఇక మనస్సును హరించలేరు, వాళ్ళ అసమర్థతే వాళ్ల అస్త్రం: కవచం!

కాబట్టి, వాళ్లు అసహాయులు అనడంవల్లనే మనం వాళ్లకు సహాయం; అసహాయులమీద ప్రేమ కనపరచటమే సమర్థ పురుషుల మనోవృత్తి. ఇంతకంటే వేరే రహస్యం లేదు!

* * *

ఎప్పుడు నిద్రపోయానో గుర్తు లేదు.

ఒకరాత్రివేళ దాహిత్రప్రవరుడు వచ్చి పక్కలో పండుకున్నట్టు తోచింది. కాళ్ళు పొట్టలో పెట్టుకుని, చుట్టచుట్టుకుని పండుకున్నాడనుకుంటాను—ఏమీ చడీ చప్పుడూ చేయలేదు. వాళ్లమ్మకు తెలిస్తే మళ్లీ పట్టి తీసుకుపోతుందనే భయంతో అరవకుండా పండుకున్నాడనుకున్నాను. నేనుకూడా నిద్రమత్తులో ఏమీ అనలేదు. కంబళి వాడిమీద కూడా వేసి పండుకున్నాను.

తెల్లవారినాక మెలకువ వచ్చింది. దొంగ వెధవని ఇక లేపుదామనుకున్నాను. శంఖుబాలుడికథ ఇప్పుడే పూర్తిచేసెయ్యాలి; లేకపోతే ఈపగలల్లా నాదుంప తెంచుతాడు. శాస్త్రం మొదలుపెట్టాను:

"లేవవోయ్!—శంఖుబాలుడు చెరువులో తామరతూళ్ళను తింటూ తిరుగుతున్నాడు. తెల్లవారింది—"

అబ్బాయి అతీపతీ చెప్పలేదు.

"ఏమోయ్, ఊఁ కొట్టవేం?"

మనవుడు మాట్లాడలేదు.

ముసుగుపెట్టి చక్కిలిగిలి పెట్టితేగాని వీడు లేవడని నిశ్చయించుకొని ముసుగు తీశాను.

ముసుగు తీయగానే చెప్పు ఎత్తవలసివచ్చింది.

పండుకున్నది మనవడు కాదు, జోనంగి కుక్క.

తలుపు తీసి వుంది కాదూ, ఎప్పుడు వచ్చిందో, రాత్రంతా నా కంబళీ కిందనే పండుకున్నది.

* * *

బ్రహ్మాండంగా చెప్పుదెబ్బ బాగానే తగిలిందనుకుంటాను.

కుక్క కోకంపట్టుతూ బయటికి పరుగెత్తింది-అసహాయ ఆక్రందనం!

నా రాత్రి సిద్ధాంతం నన్ను వెక్కిరిస్తున్నట్టుగా తోచింది!

శివ, శివ!

కాసేపు ఉన్నాక నామిత్రుడు త్రిపురాచరణుడు వచ్చి దర్శనమిచ్చాడు.

ఇతను ముసోలినీభక్తుడు. కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి ముసోలినీ గుణగానానికి పూనుకున్నాడు. నాకు గత్యంతరం లేక వినసాగాను. ముసోలినీ చరిత్ర నిష్ఠను గురించీ, వీరత్వాన్ని గురించీ అనేక సంగతులు చెప్పి త్రిపురాచరణుడు సెలవు తీసుకున్నాడు. అతను వెళ్ళిపోయినాక నా మనస్సులోని ప్రశ్న ఇంకోవైపుకు మళ్ళింది—

ఈ ప్రబలపరాక్రమవంతులైన డిక్టేటర్లుకూడా ఒక విధంగా బక్కరులే. కాని వీళ్ళను అసహాయులంటానికి వీల్లేదు అయినా, సభ్యమానవసమాజం

వీళ్ళ చర్యలను స్వేచ్ఛగా సహిస్తూ వస్తున్నది. సహించటమే కాదు, సంభ్రమంతోనూ శ్రద్ధతోనూ మోకరిల్లుతున్నది.

ఎందుకనీ?

బాగా ఆలోచించినమీదట నాకు, ఈ సిద్ధాంతానికి రాక తప్పలేదు:

ఏ ఏ కారణాలచేత మానవుడు ప్రాకృతిక ఉపద్రవాలను సహిస్తున్నాడో మృత్యువును సహిస్తున్నాడో—సహించటమే కాదు, వాటిని కేంద్రం చేసుకుని కవిత్వాలు రాస్తున్నాడో, అవి ఏ కారణంచేత వస్తవో నిర్ధారణ చేయలేక, ఈ కనపడని భగవచ్ఛక్తిని ఆశ్రయిస్తున్నాడో-సరిగ్గా ఆ కారణాలచేతనే మనం శిశువులను స్త్రీలనూ, ముసలినీనీ సహిస్తున్నాము.

అంటే, గత్యంతరం లేక అన్నమాట.

నిజానికి అసహాయులు వాళ్ళు కాదు, మనం. వాళ్ళ స్వతస్ఫూర్తినీ, దుర్దమ ప్రాణశక్తినీ ఎదుర్కొనే బలం మనలో లేదు. లేకపోవటంచేతనే వాళ్ళ ఉపద్రవాల్లో ఏదో లీలనూ, సౌందర్యాన్నీ సృష్టించి, మనం, మనకు తెలియకుండానే మన అశక్తతవల్ల కలిగిన లజ్జను అణచివేసి, పైకి పులకితులౌతూ ఉంటాము. వాళ్ల అమోఘశక్తికి లొంగిపోయినందువల్ల కలిగిన దుఃఖాన్ని, వాళ్ళ లీలలను చూస్తున్నామన్న ఆనందంతో మరిచిపోవాలని చూస్తాము.

జోసంగికుక్కను చెప్పుతో కొట్టి వెళ్ళగొట్టటం తేలిక; కాని శిశువుని—ముఖ్యంగా మనమణ్ణి-ప్రేయసిని, డిక్టేటర్ని ఇంత తేలికగా సాగనంపటానికి వీల్లేదు. అసలు అసంభవం, మనకు సాధ్యాతీతం. అందుచేతనే మనం వాళ్ళని ప్రేమిస్తాము, పూజిస్తాము.

"రాత్రి నువ్వు నన్ను పక్కలో పడుకో బెట్టుకోలేదేం?"

కాళ్ళను దుయ్యూ, చేతుల్ని బెల్లమూ పులుముకుని మనమడు వచ్చి మంచం ఎక్కాడు. నేను నవ్వుతూ వాణ్ణి చేతుల్లోకి తీసుకున్నాను.



# మెట్టవేదాంతం-3

ప్రాణకాంతుడు పొరపడుతున్నాడని నా నమ్మకం. గణేశుడు పాపులర్ వ్యక్తి. ప్రజలకు ఇష్టుడు కావటానికి ఏఏ గుణాలు అవసరమో అవన్నీ అతనిలో ఉన్నై. స్పష్టంగా చెప్పాలంటే, అతను మిథ్యావాది, మిష్టభాషి, స్వార్థపరుడు. అనర్గళంగా అతను అబద్ధాలాడుతున్నా, అతని కమ్మనిమాటలకు మనం కరిగిపోతాము; పైగా మనస్వార్థంకోసమే అతన్ని వదలిపెట్టలేము. గణేశుని గనుక ఎదిరిస్తే ప్రాణకాంతుడికి పరాజయం తప్పదు.

ప్రజాప్రియుడు కాబట్టి గణేశుడు అజాత శత్రువని నేను చెప్పటం లేదు. ప్రజాప్రియుడు కాబట్టే అతనికి శత్రువు లున్నారు. కాని వీరంతా పరోక్షంగా ఉండవలసినవారే. ప్రత్యక్షంగా అతన్ని ఎదుర్కొనేటందుకు తగినంతబలం వారి కింకా కలగలేదు. అందుకని వారు చాటుగా అతని దుర్గుణాలను చిలవలకు పలవలుచేసి ప్రచారం చేస్తున్నారు. ఐనా వీరు ప్రాణకాంతునికి ప్రత్యక్షంగా సహాయం చేస్తారని నాకు నమ్మకం లేదు. అప్పుడప్పుడు నేను గణేశుని సంగతి తలుచుకుని విచారపడుతూ ఉంటాను. పాపం, అతను పాపులర్ కావటం మూలానే కావచ్చు, అతనికి ఆంతరంగిక మిత్రులు తరుగుగా ఉన్నారు. అందరూ స్వార్థం సాధించుకోవటంకోసం అతని దగ్గర లౌకికంగా మెలుగుతారు; విధేయత చూపుతారు; కాని వాళ్లు లోలోపల మాత్రం అతనిమీద అసంతృప్తిచెంది ఉన్నారు. అతనిలో లోపాలను చూపించి, సవరించుకోమని హెచ్చరించే హితైషులు అతనికి లేరనే చెప్పవచ్చు. కాని అందరూ అతన్ని మర్యాదచేస్తారు; వోట్లు ఇస్తారు; కాని ప్రేమించరు. కాగితాలమీద అతను జనప్రియుడు; అంతరంగంలోమాత్రం అతనికి చోటులేదు.

ఒక్క గణేశునికే కాదు, ప్రపంచంలో ఉన్న పాపులర్ వ్యక్తుల కందరికీ ఇదేకర్మ! నిర్దుష్టమైన వ్యక్తి ఎప్పుడూ పాపులర్ కాలేడు. నడతలోనూ, శిక్షణలోనూ, దీక్షలోనూ కల్తీలేనిది పాపులర్ కావటం కష్టం. మేలిమిబంగారం నిత్యావసరాల కెందుకూ పనికిరాదు; కల్తీ ఉన్న నవర్సుబంగారానికే బజారులో చెలామణీ ఉంది. కాని ఆ కల్తీ

విషయంలోమాత్రం మన కళ్లు మూసుకొని ఊరుకోము. లెక్కప్రకారం వారి పిడిపట్టి, మేలిమిబంగారంతో దాన్ని సరిపోల్చి, అంతా దానికి తక్కువ విలువ ఇస్తాము. ఒకవేళ నిర్దుష్టమైన వ్యక్తి ఎవరైనా పాపులర్ అయితే అతనిలో తప్పులు వెదికి, వాటిని ప్రజలకు చూపెట్టి, వారు అతన్ని తిట్టేటట్టుగా చేస్తాము. పాపులారిటీ ఆకాశంలో క్రమంగా మేఘాలు వ్యాపిస్తాయి; ఇక హఠాత్తుగా అవి ఏనాడు కుంభవృష్టి కురిసినా కురవవచ్చు.

కాబట్టి మనం ఎనలైజ్ చేసిచూస్తే నిర్దుష్టమైన వ్యక్తి పాపులర్ కాడనీ, పాపులర్ అయిన తర్వాత అతని దోషాలుకూడా పాపులర్ అవుతాయనీ తేలుతున్నది.

చంద్రుడు పాపులర్; అతని కళంకం కూడా పాపులర్.

సూర్యుడు పాపులర్; అతనిలో మచ్చలుకూడా క్రమంగా పాపులర్ అవుతున్నై.

కాబట్టి పాపులర్ కాదలచుకున్న ప్రతి వ్యక్తీ, తన ఏయేలోపాలను మూలధనంగా పెట్టుకుని పాపులర్ కాదలచుకున్నాడో అవి అతను పాపులర్ అయిన తర్వాత ప్రతి ఇంటా విమర్శింపబడతాయని తెలుసుకోవాలి. వాటికి చలించకుండా నిర్వికారంగా ఉండటం కూడా అతను నేర్చుకోవాలి!

అది చేతకానప్పుడు అతను పాపులారిటీకి దూరంగా ఉండటమే మంచిది.

ప్రాణకాంతుడు ఈ ఓట్ల యుద్ధంలో గణేశుడితో ఢీకొనగలడా లేదో విచారించి చూడటం ప్రస్తుతం చాలా అవసరమని నేను అనుకుంటున్నాను. ఎందుకంటే నా ప్రియమిత్రుడైన ప్రాణకాంతుడిలో పాపులర్ కాదగిన గుణా లేవీ లేవు.

అతను విమర్శ సహించలేడు; తరచుగా నిజం చెప్తాడు. అతను మనసులో ఒకటి పెట్టుకుని పైకి ఒకటి మాట్లాడలేడు; ఈసంగతి అతని ముఖంచూస్తేనే తెలుస్తుంది. అతను శాస్త్రాలనుకూడా లెక్కచెయ్యకుండా తన వివేకం చూపిన మార్గానే నడుస్తూ వుంటాడు. ఇలాంటి వ్యక్తి వోట్లు వచ్చినంత మాత్రంచేత పాపులర్ అవుతాడని అనుకోటం గొంతెమ్మకోరిక. సూదిబెజ్జంలోనించి ఒంటె దూరిపోవటం ఒకవేళ

సంభవమైతే కావచ్చు కాని, ప్రాణకాంతుడు మాత్రం పాపులర్ కావడం అసంభవం.

కాబట్టి అతన్ని అదోవసు పోనివ్వను.

నేను గణేశుడికే ఓటిస్తాను. నా మిత్రుడు కాబట్టి ప్రాణకాంతుణ్ణి ఈ ఆపదనించి తప్పించడం నా కర్తవ్యం. వచ్చే 19 దో తారీఖున పోలింగ్. మధ్యను మూడు రోజులుమాత్రం ఉన్నై. పోలింగ్ కూడా ఈ ఊళ్ళో కాదు. ఆనాటికి బండిమాట్లాడుకోవాలి. నేను పోయి గణే శుడికే వోటేస్తాను; ఇంకా నామాట వింటే ఇతర్ల చేతకూడా గణేశుడికే ఇప్పిస్తాను.

ప్రాణకాంతుడు ఎప్పటికీ నాయకుడు కాలేడు, సరిగదా మా సాయం త్రం కాలక్షేపం కాస్తా పోతుంది. అంచేత అతనికి వోటు ఇవ్వను.

ఇలా నేను గట్టిగా ప్రతిజ్ఞ చేసి కూచున్నాను.

ప్రాణకాంతుడు వచ్చాడు.

రెండు మూడు కుశలప్రశ్నలు జరిగినాక నా మనస్సులోది కాస్తా ప్రాణకాంతుడి దగ్గర వెళ్ళబెట్టాను. నా ఆలోచన ఎంత సారవంత మైందో చూడమని అతనికి వివరించాను.

ప్రాణకాంతుడు తుదిదాకా శాంతంగా విని—"డాక్టరుదగ్గరకు పో" అన్నాడు.

"ఎందుకూ?"

"ఎందుకా!—నేను నా వోటుకోసం దిగులుపడటం లేదు-కాని, నీ ఉపన్యాసంలో అనారోగ్య లక్షణాలు కనిపిస్తున్నాయి. బహుశా బుర్రే చెడిపోయి ఉండవచ్చు. వెంటనే డాక్టరుకు చూపించు."

"నీ వెంత వెటకారమన్నా చేయి, నేను మాత్రం నీకు ఓటివ్వను."

"ఇవ్వకపోతే నష్టమేమీ లేదు. ముందు నువ్వు చికిత్స చేయించుకో. ఎందుకంటే, మనం అన్నిపనులూ యుక్తియుక్తంగా చేస్తామని నువ్వు చెప్పినమీదట నీమానసిక ఆరోగ్యంమీద నాకు అనుమానం కలిగింది."

"అంటే, నీవు అనేది మనం అన్నిపనులూ యుక్తియుక్తంగా చేయ మనేనా?" అన్నాను నేను.

"ఆc. మనం ప్రతిపనీ, ముందు మన ఇష్టం మొచ్చినట్టు చేస్తాము. ఆ తర్వాత లోకులకోసమూ, మన వివేకాన్ని తృప్తిపరచడంకోసం ఒక

యుక్తి కల్పించుకుంటాము. న్యాయాలయంలో జడ్జీ జూరీలదగ్గర ప్లీడరు పెట్టినట్టు."

"నౌకర్రం, కాలేదు."

"ముందు నౌకర్నుపంపి 'టీ', ఫుగాకూ తెప్పించు. చాలాసేపయింది పొగపీల్చి."

నౌకర్ని కేకవేశాను. కాసేపటికి, టీ, ఫుగాకూ వచ్చింది. టీ త్రాగి, ధూమపానం చేశాము. ఎవ్వరమూ మాట్లాడలేదు.

మా నిస్తబ్ధతను భంగపరుస్తూ ప్రాణకాంతుడన్నాడు:—"కొంచెం ఆలోచించిచూడు, జీవితంలో మనం ఏఏ పనులుచేసి అయితే ఆనందం పొందామో, వాటి అన్నిటికి ప్రేరణ ఎక్కడనించి వచ్చింది? యుక్తి యుక్తంగా ఆలోచించిన మీదటనా, ఊరకనేనా? సరే, ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది, ఇవిగో, నీ భార్య లోలక్కులు బత్తుడు ఇచ్చాడు."

లోలక్కులపెట్టె టేబిలుమీద పెట్టాను.

కొన్నాళ్ళక్రిందట ప్రాణకాంతుని భార్య కర్ణభూషలు మా ఆవిడను ఆకర్షించినవి. ఆమె కోరిక తీర్చటంకోసం నేను నా ప్రియమిత్రుడైన ప్రాణకాంతుడి సహాయం యాచించవలసి వచ్చింది. ఎందుకంటే, నా భార్యను ఆకర్షించిన ఆదర్శం ప్రాణకాంతుని భార్య చెవులను తప్ప లేదు. అందుకనే ఆ వస్తువు చేయించేభారం ప్రాణకాంతుని భుజస్కంధం మీద వేశాను.

ఈ మామూలువిషయం ఇప్పుడు అంతులేని ప్రాముఖ్యం వహించి కూర్చున్నది. ప్రాణకాంతుడు మొదలుపెట్టాడు:

"భార్యకు నగ చేయించే విషయంలో నీకు అనుకూలమైన కారణాలేమి ఉన్నాయో చూపగలవా? స్త్రీలు పురుషుడి మనస్సును హరించటంకోసమే నగలు ధరిస్తారు. నీ భార్య పరపురుషుని ఆకర్షించటంకోసం ఈనగ ధరించి ఉండదని నేను అనుకుంటాను. అప్పుడిక ఆమెలక్ష్యం నువ్వేనని అనుకోవాలికదా? నీ మనస్సు హరించటంకోసం నీ భార్య ఇంకా కొత్త నగలు ధరించాలని నీవు అనుకుంటున్నావా? ఒకవేళ ఉందనే అనుకుందాము. కాని ఆ అలంకారాల్ని నీవే తీసుకువచ్చి ఇవ్వడం ఎంత హాస్యాస్పదంగా ఉంది! దీన్నే తిరుగుడు లేకుండా చెప్పాలంటే-నాజేబులో డబ్బు ఖర్చుపెట్టి నామనస్సు హరింపబడటంకోసం

కావలసిన సామగ్రి తెచ్చి నీకిచ్చాను. నామనస్సు బార్లాగా తెరుచుకుని కూర్చున్నాను. రా, ఇక నీవు వచ్చి దాన్ని దొంగలించు—అని అనటం కాదా ?''

ప్రాణకాంతుడు గనక రేగాడంటే ప్రాణాంతకంగా ఉంటుంది.

అత నిలా రేగినప్పుడు అతనితో తర్కించటంకంటే వోటు పారెయ్యటమే సులభమైనపని.

''సరే, ఈసంగతి పోనివ్వు, నీతో తర్కించటం నాకిష్టంలేదు. నా వోటు నీకే ఇస్తాను.'' అన్నాను.

''నీ సద్బుద్ధికి నేను చాలా సంతసించాను. కాని ఎలక్షణ్ అయి పోయింది. నువు శ్రమ పడనక్కర్లేదు!'' అన్నాడు ప్రాణకాంతుడు.

''అదేమిటి ! పోలింగ్ 19 వ తేదీ అన్నారుకదూ? ఇవ్వాళ పదహేనేగా!''

''నువు బెంగాలీ తారీఖులు చెప్తున్నావు. పోలింగు ఇంగ్లీషు తారీఖులో జరిగిపోయింది.''

ఒక్కమాటుగా ఆకాశంలోనించి క్రిందపడ్డాను.

''లెఖ్ఖలు అయినాయా?''

''ఆం. నేను ఓడిపోయాను, ఒక్క ఓటువారలో.''

''నాకోసం ఎవరినైనా పంపినా పోయేదిగా.''

''నేను ఎవరికోసం మనుష్యుల్ని పంపలేదు. ఎలక్షన్లో నేను ఓడిపోయినా, పంటెంలో గెలిచాను. హారీన్‌తో పందెం వేసి నేను ఎలక్షణుకు నిలబడ్డాను. హారీన్ నువు గెలుస్తావని అన్నాడు; నేను నేను ఓడిపోతానన్నాను. నీకు గుర్తుందో లేదో, నాతరఫున హారీనే క్యాన్వాసు చేశాడు. నేనేమీ చేయలేదు. అసలు, పోలింగు జరిగేటప్పుడు నేను ఊరిచెరువులో గాలంవేసి కూచున్నాను. ఆ పందెండబ్బులు పెట్టె నీ భార్యకు నేనిప్పుడు లోలక్కులు చేయించుకు వచ్చాను. దీనికి నీవు డబ్బు ఇవ్వనక్కరలేదు. ముందు లోపలికిపోయి కనుక్కో, నీభార్య కివి నచ్చినవో లేదో !''

పెట్టె తెరిచి చూశాను. చాలా అందంగా ఉన్నాయి! డబ్బుకూడా ఇవ్వనక్కరలేదు!

మళ్ళీ ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

# అపూర్వ కౌశలం

ప్రొడావు ఏడు అడుగులుంటాడు అతడు. అతనిమూలాన మేము నిజంగా చాలా చిక్కుల్లో పడ్డాము.

ఈ విదేశస్తుడు మొట్టమొదట ఇక్కడికి వచ్చినప్పుడు మేము "పెద్ద మనుష్యు"లను ఎలా మర్యాద చెయ్యాలో అలానే చేశాము. అతను కూడా మొదట చాలా మర్యాదగావుండి మా అందరి సానుభూతీ సంపాదించాడు. మా గ్రామంలోని పిల్లలందరికి ఉచితంగా ఆడుకునే బొమ్మలిచ్చేవాడు; ఊళ్ళో యెవ్వరికి జబ్బు వచ్చినా పోయి సేవ చేసేవాడు; గ్రామఫోను పెట్టి విదేశీసంగీతం వినిపించేవాడు; మత విషయాలూ, శాస్త్ర విషయాలూ అనేకం చెప్పేవాడు. నిజం చెప్పాలంటే మేమంతా ముగ్ధులమయిపోయాము. అతను ఈవూళ్లోనే వుండిపోవాలని మేము చాలా పట్టుకూడాపట్టాము. అతను మావల్లనే కొంతభూమి సంపాయించి మా ఊరి మధ్యనే తిష్టవేశాడు. కాని ఇప్పుడు మేము చాలా విపత్తుల్లో పడిపోయాము. ఆవ్యక్తి ఇప్పుడు, తన అసలురూపం బయటపెట్టాడు, పట్టపగలు చెప్పి మరీ దొంగతనం చేస్తున్నాడు. ఎక్కడో తిండికరువు వచ్చిందట—అక్కడికి తినుబండారాలు పంపాలట; ఏవిధంగానైనా సరే పంపితీరవలసిందేనట. పంపుతున్నాడు కూడా. ఇలాంటి మానవ హితైషికి అడ్డు రావటానికి చాలామంది ఇష్టపడటంలేదు. వారి వివేకం అడ్డువస్తున్నది. ఆవ్యక్తి చాలా పొడుగు; కాని అతని స్నేహితులందరూ పొట్టివాళ్లు. ముఖ్యంగా అమాయకులైన కుర్రవాళ్లు ఆడుకుంటానికి బొమ్మలిస్తాడనే ఆశతో వాడి పాదాక్రాంతులైనారు. పొట్టివాళ్ళు వేయినోళ్ల పొగుడుతున్నారు.

ఎవరో కూరగాయలు అమ్ముకునేది తట్టనెత్తిన పెట్టుకుని బజారున పోతున్నది. అతను కేక వేశాడు, ఆగమని. ఆమనిషి ఆగగానే పొట్టివాళ్ళంతా ఆమెను చుట్టూ ముట్టారు. ప్రతి పొట్టివాడి చేతులోనూ ఒక సంచిఉంది-పొడుగువాడు తన పొడుగు చేతులతో తట్టలో కూరగాయలు తీసి పొట్టివాళ్ల సంచుల్లో టపటప వేయసాగాడు. చూస్తూ వుండగానే తట్ట కాళీ అయింది—సంచులు భర్తీ అయినై. పొట్టివాళ్లు సంచులు భుజాన పెట్టుకుని వెళ్ళిపోయారు. కూరగాయల అమ్మి డబ్బడిగినప్పుడు

పొడుగువాడు—"చూడమ్మా! మానవజాతి కళ్యాణంకోసం నీ కూరగాయలు తీసుకున్నాను. లాభం వేసుకోమాకు, న్యాయమైన ధర తీసుకో!" అన్నాడు.

కానీ, అర్ధణా—ఇలా అతనికి తోచినంత ఇచ్చాడు. కొందరికి ఇవ్వనేలేదు. పాపం ఆ బీదా-బక్కా భయంతో అతన్నేమీ అనలేక పోయారు. ఒకడు కామాలు ఎదురుచెప్పాడు—ఇంకేం, చెంప దెబ్బతో వాడినోరు మూయించాడు పొడుగువాడు.

చేతులు పొడుగు ఉండటంవల్ల అ నేక వీళ్లు ఉన్నై అతనికి. అతను చెయ్యెత్తి పెట్టుకున్న పళ్లుకూడా అమాంతం కోయగలడు. ఆవాళ భ సేశ్వరుడి అటక మీదినించి గుమ్మడికాయలు ఎత్తుకు వెళ్లాడు. అతను పోలేని చోట్లకు పొట్టివాళ్ళు ఉండనే ఉన్నారు—కోతుల్లాగా ఎక్కించుకు వచ్చేవాళ్లు. వాళ్లని ఏమంటానికీ వీలులేదు. మానవ హితైషికి ఎవరు అడ్డురాగలరు? అదీకాక, చెంపదెబ్బలభయం ఒకటివుండనేవుండె!

ఆ వ్యక్తి ఎంత ఎత్తంటే, నాలాంటి ఎత్తువాడుకూడా అతనితో మాట్లాడాలంటే పైవంక చూస్తూ మాట్లాడాలి. ఒకసారి మాట్లాడడం మొదలు పెట్టామంటే ఇక కదలటానికి వీలులేదు-అతని తియ్యనిమాటలు మనం నోరు తెరుచుకుని వింటూ ఉండవలసిందే. అతనికి మాట్లాడే నేర్పు బాగా ఉంది. ఒకనాడు మేము కొందరం అతనిబారినపడ్డాం; ముఖాలు పైకెత్తుకుని తన్మయులమై అతనిమాటలు వింటున్నాము. పొట్టివాళ్లు మా చుట్టూనుంచున్నారు. వీళ్లెప్పుడూ అతని వెంటే ఉంటారు. మాట్లాడటం అయి పొట్టివాళ్లని అతను వెంటపెట్టుకుని వెళ్లిపోయినాక, మేము మా జేబులు కత్తిరింపబడటంచూసి ఆశ్చర్యపడ్డాము. మేము ముఖాలు ఎగబట్టుకుని ముగ్ధులమైనట్టూవుండటంచూసి పొట్టివాళ్లు మా జేబులు కత్తిరించారు!

ఎలారాసివుంటే అలాజరుగుతుంది తర్వాత, అని ఎవరికి చిక్కినకర్రా కట్టెపేళ్లూవాళ్లు తీసుకుని బయులుదేరాము, అతనికోసం. దోవలో మాకు అపూర్వబాబు గనక కనిపించకపోయినట్టయితే ఆవాళ అటో ఇటో తేలేది. అపూర్వబాబు విద్వాంసుడూ, బుద్ధిమంతుడూ. అతన్ని మా జట్టులో చేర్చుకుంటే మాకు బలంగా ఉంటుందన్న నమ్మకంతో వెనకజరిగిన సంగతులన్నీ చెప్పి వారిని మాతో కలవమని బలవంతపెట్టాము.

అంతావిని కాసేపు ఆయనేమీ మాట్లాడలేదు. ఆతర్వాత–"మీరు వారమేమీ చెయ్యకుండా నావెంటరండి–" అన్నాడు. మేము వెళ్లాము.

ఆయన పంచలో మమ్మల్ని అందర్నీ కూర్చోపెట్టి—"పందులూ, నక్కలూ మానవజాతికి పరమశత్రువులని, అందులో ముఖ్యంగా రైతులకు, మీరొప్పుకుంటారా లేదా?" అని అడిగాడు. 'తప్పకుండా' అని అంతా అన్నాం.

"ఈ పెద్దమనిషి ప్రస్తుతం తన తుపాకితో పందుల్నీ, నక్కల్నీ చంపుతున్నాడని మీరు ఒప్పుకుంటారా, లేదా?"

ఒప్పుకోకుండా ఉండడం ఎట్లా? ఆ వ్యక్తికి బోలెడు పొలమూ పుట్రా ఉంది. సొంతంగా వ్యవసాయం చేస్తాడు. తన పైరు కాపాడు కోవటం కోసమే అతను పందుల్నీ, నక్కల్నీ ఏమిటి, ఇంకా ఎన్నో జంతువుల్ని చంపాల్సి ఉంటుంది. చంపుతున్నాడు కూడా.

ఒప్పుకున్నాము.

"కాబట్టి ఆ వ్యక్తి పరోక్షంగా మనకు ఉపకారం చేస్తున్నాడంటావా, లేదా?" అన్నాడు అపూర్వబాబు జామెట్రీ పద్ధతిగా నిరూపించి. నాకు లెఖ్ఖలు బొత్తిగా రావు. అంచేత ఒప్పుకోవడమే శ్రేయస్కరమనుకున్నాను. అప్పుడు అపూర్వబాబు దిగ్విజయం చేసినవాడి లాగా—"ఐతే ఉపకారం చేసేవాడిని చంపటం ఉచితమా?" అని ప్రశ్నించాడు. దీనికి జవాబేమివ్వాలో నాకు ఎంత ఆలోచించినా తోచలేదు. దీనూ నా మనోభావాలకి రూపం ఇచ్చాడు.

"కాని అతను మా స్థితిని నానాటికీ అధ్వాన్నం చేస్తున్నాడు. మొన్న మా దుకాణంలో మిఠాయీ రసగుల్లాలూ పళ్ళెలతో సహా ఎత్తుకుపోయాడు."

అపూర్వబాబు మందహాసంచేసి "నాకంతా తెలుసు. దానికికూడా నేను ప్రతిక్రియ ఆలోచించి ఉంచాను. 'అత్యుచ్చః పతనాయచ.' పెరుగుట విరుగుటకొరకేనని మీరు ఒప్పుకుంటారా?" అన్నాడు.

"ఎందుకు ఒప్పుకోమూ?"

"ఐతే ఈ సూత్రప్రకారమే మనం దీనికి ప్రతిక్రియ చేయాలి. ఈ వ్యక్తిని మనం ఇంకా పైకి పెంచాలి. ఇంకా భూములూ, ధనమూ, ప్రతాపమూ, పరపతీ బాగా పెంచి పైకి తీసుకుపోతే, అక్కడనించి

పడిపోక తప్పదు ఎప్పటికైనా! అతనికి బూట్లు వేసుకోటం శ్రద్ధా అని మీరు కనిపెట్టారా?"

"ఆఁ" అని ఒప్పుకున్నాము.

"అతని ఈ దౌర్బల్యం గ్రహించే నేను చిన్న ట్రిక్ చేసి ఉంచాను. రండి, చూపిస్తాను." గదిలో ప్రవేశించి చూశాము. ఒక అడుగు ఎత్తు మడిమలుగల బూట్లు, చక్కనివి, టేబిలుమీద పెట్టి ఉన్నై.

"ఈ వ్యక్తిని క్రమంగా పైకి పెంచుకుపోవాలని నాప్లాను. దీని ఉద్దేశం ఏమిటంటే, ఈ బూట్లు అతనికి తొడిగించి అతని శరీరభారాకేంద్రంలో మార్పు తేవాలని. అసలే మనిషిపొడుగు; అందులో షోకు కోసమని బూట్సువేసుకుని నడవటానికి ప్రయత్నించాడంటే మధ్యాకర్షణ నియమప్రకారం బోర్లపడతాడు. కర్రలతో కట్టెపేళ్ళతో అవసరమే ఉండదు."

"ఇందాక మీరు పందుల్ని నక్కల్ని చంపటానికి అతన్ని బ్రతికించి ఉంచాలంటిరి కదా?" అన్నాను నేను.

"తప్పకుండా ఉంచవలసిందే. అతన్ని క్రమంగా పైకి పెంచటానికి ప్రయత్నిద్దాము; అలా అయితే ఒక్క దెబ్బకు రెండు పిట్టలు పడతై! మంచి బలవంతుడవటం మూలాన పందుల్నీ, నక్కల్నీ చంపుతాడు— 'పెరుగుట విరుగుటకొరకే' అన్న సూత్రప్రకారం తనూకూడా చివరికి నాశనమవుతాడు. రష్యాలో జారుచరిత్ర తెలియదా మీకు?"

దీనూ ఇంతవరకూ ఆశ్చర్యంతో బూట్లచుట్టూ తిరిగిచూస్తున్నాడు. అతగాడి "ఇలాంటి చెప్పులు తొడగటాని కెవడు ఒప్పుకుంటాడు?" అన్నాడు.

"వొప్పించాలి. బ్రతిమాలి అయినాసరే, బలవంతానైనాసరే. అవసరమైతే కాలికి చమురురాసి, ముఖమల్లుకప్పవేసిన షూహార్న్ అయినా తీసుకుని ఈ బూట్లు అతనికి తొడగటానికి నేను నిశ్చయించుకున్నాను. చూడండి, ఏంచేస్తానో—" అన్నాడు.

మేము ఆశ్చర్యంతో మాట్లాడలేకపోయాము.

# అపూర్వ రహస్యం

ప్రవాళ అపూర్వబాబు మాంచి చిత్రం చేశాడు. దేవాయి పీటమీద కూర్చుని ఉన్నాడు; అతనిముందు మిఠాయిపళ్ళెం; ప్రక్కనే మంచినీళ్ల గ్లాసు. దేవాయి మిఠాయి తినటానికి ఉపక్రమించబోతూవుండగా అపూర్వబాబు ప్రవేశించాడు. దేవాయి వినయంతో అన్నాడు.

దేవాయి:—రండి, అపూర్వబాబుగారూ! మిఠాయి తింటారా?

అపూర్వ:—ఏం చేస్తున్నావు నువ్వు?

దేవాయి:—(సంకోచంతో) మిఠాయి తినబోతున్నానండీ.

అపూర్వ:—నీ పేరేమిటి?

దేవాయి కొంచెంసేపు ఆశ్చర్యంగా చూశాడు.

దేవాయి:—నాపేరు మీకు తెలియదా?

అపూర్వ:—ఐనా చెప్పు మళ్ళీ.

దేవాయి:—నాపేరు దేవాయి.

అపూర్వ:—నీకింక ఏపేరూ లేదా?

దేవాయి:—అసలు నా పూర్తిపేరు దేవతాచరణుడు.

అపూర్వ:—ఐతే మిఠాయి ఎవరుతింటారు? దేవాయా, దేవతాచరణుడా?

దేవాయి:—[విస్తుపోయి] నాకేమీ అర్థం కాలేదండీ.

అపూర్వ:—నీపేరులో నాలుగు శబ్దాలున్నై. దేవాయి, దేవతా, చరణుడూ, దేవతా చరణుడూ. మిఠాయి ఎవ్వరు తింటారు?

దేవాయి కొంచెంసేపు ఆలోచనలోపడి, తగిన సమాధానం ఒకటి ఆలోచించాడు.

దేవాయి:—మిఠాయి నేనే తింటాను.

అపూర్వ:—నీవు ఎవరు?

దేవాయి:—దేవాయిని.

అపూర్వ:—నీ పేరు తింటుందా ఏమిటి మిఠాయి?

దేవాయి:—పేరెలా తింటుందండీ, నేనే తింటాను.

అపూర్వ:—[విసుగుతో] అందుకనే అడుగుతున్నాను నువ్వెవరవని?

దేవాయి:—[కొంచెం కోపంతో] నేను దేవాయిని.

అపూర్వ:—నువ్వెవరవో నీకు తెలియదనుకుంటాను.

దేవాయి:—అంటే?

అపూర్వ:—అంటే నీలో చాలాదాగివుంది, నీకు తెలియకుండా.

దేవాయి:—దాగిఉందా!

అపూర్వ:—అఁ. నీకు ఆత్మజ్ఞానం కావాలా? కోపించమాకు, చెప్పు! నీకు నిజంగా ఆత్మజ్ఞానం కావాలా?

దేవాయి మెదలకుండా ఊరుకున్నాడు. అద్భుతమైనటువంటి తీక్ష్ణ దృష్టితో అపూర్వబాబు దేవాయివంక చూడనారంభించాడు. దేవాయి మంత్రించిన వానిలాగా అయిపోయాడు.

అపూర్వ:—[నెమ్మదిగా వాడికల నిమురుతూ] చెప్పు నీకు ఆత్మ జ్ఞానం కలిగించమంటావా?

దేవాయి:—[నిద్రమత్తులో ఉన్నవాడి మాదిరిగా] కలిగించండి.

అపూర్వ:—దేవతా, చరణుడూ, రెండు శబ్దాలుమాత్రమేనని నీ అభిప్రాయం. వీటిని శాస్త్రంలో శబ్దబ్రహ్మ అంటారు. శంకరుని మత ప్రకారం జీవాత్మే బ్రహ్మ. రెండు జీవాలు కలవటంవల్లనే నీవు దేవతా చరణుడి వయావు. ఈసంగతి నీకు తెలుసునా?

దేవాయి:—చిత్తం నాకు తెలియదు!

అపూర్వ:—ఐతేచూపిస్తాను. [వాకిలివంకచూసి] ఒరేయ్ మీరురండి.

చాకలి రామాయీ, మాదిగ శీనాయీ వచ్చారు.

అపూర్వ:—[రామాయితో] నీపేరేమిటి?

రామాయి:—దేవతా.

అపూర్వ:—[శీనాయితో] నీపేరేమిటి?

శీనాయి:—చరణుడు.

అపూర్వబాబు మందహాసంతో దేవాయివంక చూశాడు.

దేవాయి:-[విస్మయంతో]కానివీళ్ల పేర్లురామాయీ, శీనాయీ కాదూ?

అపూర్వ:—ఉహుఁ, నీది పొరపాటు. ఇంకా చూపిస్తాను వుండు. అవ్యయం అంటే యేమిటో నీకు తెలుసా?

దేవాయి:—అవ్యయమా?

అపూర్వ:—అఁ, అవ్యయం.

దేవాయి:—[చిన్నతనంలో చదువుకున్న వ్యాకరణం కొంచెం జ్ఞాపకం తెచ్చుకోగలిగాడు.] రూపంమారనిశబ్దాన్ని అవ్యయం అంటారు. కానీ ఏదైతే యితర శబ్దాలతో కలిసి-కలిసి-

అపూర్వ:—చాలు! ఇక చెప్పనక్కర్లేదు. దేవతా, చరణుడు. ఈ శబ్దాల అవ్యయరూపం చూడూ—[వాకిలివేపుచూసి]ఒరేయ్, మీరు రండి ఇలా—

[రమేన్, హరీష్, యతీన్, సురేష్, కాళీ, విపిన్, సుఖేన్, శ్యామ ప్రవేశిస్తారు. అంతా చదువుకొంటున్న కుర్రవాళ్ళు; అందరూ అపూర్వ్ బాబు భక్తులు. అంతా మందహాసంచేస్తున్నారు.] మీమీ పేర్లు యేమిటి?

రమేన్:-ఉపదేవతా; హరీష్ - అపదేవతా, యతీన్ - అతిదేవతా, సురేష్-అభిదేవతా, కాళీ-సంచరణుడు, విపిన్-దుశ్చరణుడు, శ్యామ-ఆచరణుడు అన్నారు.

దేవాయి:—నాకేమిటో ఈవ్యవహారం అంతుపట్టటంలేదు.

అపూర్వ:—వీళ్ళ పేర్లలోకూడా ప్రతివానిదాంట్లో దేవతా, చరణుడూ ఉన్నది. అంటే వీళ్లలో ప్రతివానికీ నీమిఠాయిలో భాగంఉన్నది.

దేవాయి:—[చకితుడై] అలాగా! వీళ్ళకి మిఠాయి పెట్టటానికి నాకేమీ ఆక్షేపణలేదు. కాని వీళ్లు బలవంతాన లాక్కుంటారా ఏమిటి?

అపూర్వ:—దయాధర్మాలమీద ఆధారపడి ఉండేవాళ్ళు కారు వీళ్ళు. ఎందుకంటే నీమిఠాయిమీద వీళ్ళకికూడా సమాన అధికారం ఉంది. ఇవ్వకపోతే బలవంతాన లాక్కుంటారు.

దేవాయి:—ఐతే మాభూతాని పిలవవలసి ఉంటుంది.

అపూర్వ:—ఈభూతా ఎవరూ?

దేవాయి:—మానౌకరు.

అపూర్వ:—వాడిని పిలవవలసిన అవసరంలేదు, [రమేన్‌తో] బయట యింకా పిల్లలున్నారా?

దేవాయి:—ఆఁ.

అపూర్వ:—వాళ్ళకి ధూతశబ్దం తగిలించి తీసుకురా.

రమేన్ వెళ్ళిపోయాడు.

అపూర్వ:—[దేవాయితో] పేరులో ఏమీ లేదు. బయట గుర్తించ టానికి మాత్రం పనికివస్తుంది. అసలు వస్తువు జీవాత్మ. పేరు అంటేనే ఒక శబ్దముగానీ, ఒకటికంటే ఎక్కువ శబ్దాలుగానీ కలయిక అని తేలు తుంది. ఇంతకుముందే నీకు శబ్దమంటే జీవాత్మ అని ఋజువుచేశాను.

క్యాబ్లా, చోటూ, చిప్‌లే, పూతూ, హోబుల్, గదాయీ వాళ్ళను వెంటబెట్టుకుని రమేన్ వచ్చాడు.

అపూర్వ:—మీ పేర్లు ఏమిటీ? క్యాబ్లా-ప్రభూత, చోటూ-పరాభూత, చిప్‌లే-సంభూత, పూతూ-అనుభూత, హోబుల్-ఉద్భూత, గదాయీ-అభి భూత అని గబగబజవాబు చెప్పారు. అపూర్వబాబు దేవాయివంక చూశాడు.

దేవాయి:—ఎందుకు వీళ్ళ నిలా చేర్చారు? దీని అర్థమేమిటీ?

అపూర్వ:—వీళ్ళంతా కూడా న్యాయంగా నీ మిఠాయిలో భాగం పంచుకోదగినవాళ్ళు.

దేవాయి:—ఇది చాలా చిత్రంగా ఉంది!

అపూర్వ:—[అందరివైపు చూసి] మీకు మిఠాయి తినాలనే కోరిక లేదూ? మీరు బాగా ఆలోచించి చెప్పండి!

ఇక్కడే కొంచెం తిరుగుడు పడింది. నోట పెట్టుకువచ్చిన మాటలు అన్నప్పుడెల్లా జ్ఞాపకానికి రావు. అందరి ఎదటా అపూర్వబాబు అవి జ్ఞాపకంకూడా చెయ్యలేకపోయాడు. ఆయనగారి శిష్యులు నిజంగానే బాగా ఆలోచించి సమాధానం ఇచ్చారు.

దేవతా:—నాకు ఉప్పగా ఉండటం ఇష్టమండీ.

చరణుడు:—నాకు కారం కావాలండీ. [కాలేజీ కుర్రవాళ్లు వాళ్ళ కొత్త ఉపాధికి తగినట్టుగానే కవిత్వపుపోకడ పోయారు.]

ఉపదేవతా:—నాకు కోడిమాంసము కావాలి.

అపదేవతా:—నాకు చేపలు కావాలి.

అతిదేవతా:—నాకు కావలసింది నల్లగుండె.

అభిదేవతా:—నాకు పొట్టేలుమాంసము కావాలి.

సంచరణుడు:—నాకు తిండి అక్కర్లేదు. ఊరికతిరగాలని ఉంది.

విచరణుడు:—నాకుకూడా, కాని అంత మెల్లిగా కాదు.

సుశ్చరణుడు:—నాకు తినాలనీ లేదు, తిరగాలనీ లేదు, తన్నాలనిఉంది.

అచరణుడు:—నాకు ఉపదేశించాలని వుంది.

ప్రభూత:—నేనున్న లావుకు ఇంకా తినటం మంచిదంటరా?

పరాభూత:—ఈ విషయంలో నే నేమి చెప్పినా బాగుండదు.

అపూర్వబాబు:—[గద్దిస్తూ] కేవలం సామ్యంకోసమైనా మీరంతా మాకు మిఠాయి ఇష్టమని చెప్పవలసింది.

అందరు:—సామ్యప్రకారమైతే తప్పకుండా—

అపూర్వ:-[నవ్వుతూ] ఐతే మీ అందరికీ ఇవి తినాలని ఉందన్నమాట?

అందరూ:—సామ్యంకోసం తప్పకుండా!

ఇంతవరకూ అభిభూత మాట్లాడలేదు. ఇప్పుడతను చేతులు జోడించి హృదయభారం తగ్గించుకోటానికి చూశాడు.

అభిభూత:—మహాప్రభూ! నా విన్నపం ఒకటి ఉంది.

అపూర్వ:—ఏమిటి, చెప్పూ?

అభిభూత:—ఈ మిఠాయి తమరే తినండి, తమరు మా అందరికోసమై ఆలోచించారు కాని మీకోసమై ఆలోచించలేదు. అహా! ఏమి ఉదార బుద్ధి తమది. తమకు మిఠాయి అంటే ఎంత ఇష్టమోకూడా నాకు తెలుసు.

దేవాయి మినహా మిగతావారంతా:-తప్పకుండా తినాలి. తప్పకుండా.

అపూ:-మీ అందరిఉద్దేశమూ ఇదేనన్నమాట! [దేవాయితో] మరినువ్వు.

దేవాయి:—నేను ముందుగానే మీకు భాగం పెడతానన్నాను. మీరు తింటానంటే నాకు ఆక్షేపణ ఏముంది! భోంచెయ్యండి.

అపూర్వ:—మీరంతా అలా పట్టుపట్టినప్పుడు—

అపూర్వబాబు నోరు ఆనందంతో చెవులవరకూ తెరచుకుంది. పళ్లెం ఎత్తి అతను మిఠాయి తినటం మొదలుపెట్టాడు.

# అపూర్వ విజ్ఞానం

హఠాత్తుగా నాకు మెలకువ వచ్చింది.

మా పేటకు నిప్పుముట్టుకుంది. అసలే మా పేట అంతా పూరి కొంపలు!...పరుగెత్తుకుంటూ బయటికి వచ్చాను. వచ్చి చూద్దును గదా, బందిపోటు దొంగలు! వాళ్ళే నిప్పు పెట్టారు...మరి ఊళ్ళో వాళ్ళంతా ఏమయినట్టు? వెదురు పేల్తున్న శబ్దం తప్ప మరేమీ వినిపించలేదు. బజారికి పోదామని పంచలోనించి దిగాను. ఎవరో నా ముక్కుమీద బలంగా గుద్దారు; నేను తలతిరిగి పడిపోయాను. ఒక్క క్షణంలో ఇంకో చాలామంది వచ్చి నా చేతులూ కాళ్ళూ కట్టేశారు. కాని ఆఖరికి తప్పించుకు బ్రతకగలిగాను. ఒకదొంగ నామీదికి వంగిచూసి—"అరే! ఈయన డాక్టరుగారు. వదిలిపెట్టండి!" అన్నాడు, ఈమాటలు అన్న నాప్రాణదాత ఎవరో నేను గుర్తించలేకపోయాను. కారణం, వాళ్ళంతా ముఖాలకు ముసుగులు వేసుకున్నారు. నాకట్లు విప్పదీసి వాళ్లు వెళ్ళిపోయారు. వాళ్ళ అల్లరి అగమూ లేకుండా ఆ వెళ్ళే పద్ధతి చూసి నేను ఆశ్చర్యపోయాను. ఈ పేటలో వాళ్ళందర్నీ, ముసలీ, ముతకా, పిల్లా జల్లాతో సహా ఇలాగే కట్టివేశారు.

లేచి నిలబడ్డాను కర్తవ్యమేమిటో నిర్ణయించబోయి నిరాశ చెందాను. ఈ ఆయుధాలు ధరించిన పెద్ద గుంపును నేనేమి చేయగలను. ఒక్కక్షణం హఠాత్తుగా ఆడమనిషి గొంతు విని చకితుణ్ణి అయాను. కొంచెం ముందుకుపోయి చూద్దునుగదా, దోపిడేకాదు, బలాత్కారం కూడా జరుగుతున్నది! దీనికి ఆక్షేపణ తెలపడం అవసరమని నాకు తోచింది. బిగ్గరగా అరిచాను. కాని నామాట ఎవ్వరూ వినిపించుకోలేదు. దగ్గరలోనే ఇటికరాళ్ళ గుట్ట ఒకటి ఉంది. నేను ఉత్తేజితుణ్ణయి ఒకరాయి తీసుకుని ఆ దొంగల్లో ఒకరికి గురిపెట్టి విసరబోతున్నాను. ఈ సమయంలో ఎవరో వెనకనించి వచ్చి నాచెయ్యి పట్టుకుని—"ఏమిటి

మీరు చేసేదేమీ? ఆ ఇటిక అవతల పారేసి నా వెంట రండి'' అన్నాడు.

తిరిగి చూశాను. మా పొరుగు అపూర్వబాబు. ఈయన ప్రాజ్ఞుడు; విజ్ఞాననిధి. ఎప్పుడూ ఆయనకు నేను విధేయత చూపిస్తూనే ఉన్నాను.

ఇటిక రాయి అవతల పారవేశాను.

''రండి, నా వెంట'' అన్నాడు ఆయన.

ఇంటి వెనక చిన్న తోపు ఉన్నది. అపూర్వబాబు దోవతీశాడు; మేము తోపు మధ్యకు వెళ్లాము. ఎప్పుడు చేరుకున్నారో తెలియదు. మా సంసారమూ, అపూర్వబాబు సంసారమూ అక్కడ ఉన్నారు. ఇది అపూర్వబాబు ప్రజ్ఞే కావచ్చును.

''కొంచెం బుర్ర సరిగ్గా పెట్టుకుని ఆలోచించండి. మన అసలు లోటు ఎక్కడ ఉన్నదో తెలుస్తుంది. ఏమంటారు? మన ముఖ్య-లోటు ఐక్యత లేకపోవటం. అది ఉంటే మన పేటకు దొంగలు రాగలుగుతారా? ఊరక మీరు ఒక రాయి విసిరినంతమాత్రంచేత వాళ్ళని ఏమి చెయ్యగలరు? అసలు మూలసమస్య ఏదో మీరు దాన్నిగురించి ఆలోచించండి. కావలంటే చూడండి,—రష్యాలో—

అపూర్వబాబు మెల్లగా ఉపన్యాసం మొదలు పెట్టాడు. ప్రపంచ చరిత్రా, భూగోళమూ, విజ్ఞానమూ, రాజనీతీ ఆయనకు నల్లేరుమీద బండి. నేను ఆ తోపులో కూచుని ముక్కు నెత్తురు తుడుచుకుంటూ తుడుచుకుంటూ అపూర్వబాబు చెప్పే ఉపన్యాసం విని మనలోటు ఎక్కడ ఉందో తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను.

దోపిడి జరుగుతోనే ఉంది.

# యుగాంతరము

ఏక్ కడీ మునిమనమడూ, దుకడీ మనుమడూ, తీన్ కడీ పుత్రుడూ ఐన పాంచకడీ పోద్దార్ తన పుత్రుడైన చకడీ విషయమై చిక్కుల్లో పడ్డాడు.

హరిణపాటీ గ్రామంలో పాంచకడీ పోద్దారును అందరూ గౌరవిస్తారు. నిజానికి ఆయన ఆ ఊళ్ళో మణిపూసలాంటివాడు. అన్ని విషయాల్లోనూ ఆయన అభిప్రాయమే ప్రామాణికంగా ఎంచబడుతుంది. అన్ని విషయాల్లో తన అభిప్రాయాన్ని వెల్లడించటానికి తగిన మానసిక స్థిరత్వంకూడా ఆయనకు ఉంది. ఏ విషయమైనా తీసుకోండి—సంగీతం కానీ, సాహిత్యంకానీ, చిత్రకళ కానీ, సినిమా కానీ, ఈనాటి సాంఘిక స్థితి కానీ, స్త్రీవిద్య కానీ, మార్కెటు ధరలు కానీ, మహాత్మా గాంధీని గురించికానీ—ఆయన వేలెత్తి చెప్పారంటే హరిణపాటీ గ్రామంలో ఉన్నవారంతా మహదానందంతో వొప్పుకుంటారు. వొప్పుకొని తాము ధన్యులమయామనికూడా అనుకుంటారు.

వేరే మార్గంకూడా లేదు, వారికి.

పాంచకడీ పోద్దార్ చాలా ధనవంతుడు. ఆ ఊళ్ళోఉండే పెద్ద పెద్ద వారంతాకూడా అతని దగ్గర అప్పు తీసుకున్నవాళ్ళే. కాబట్టి హరిణపాటీ గ్రామంలో సంగీతం కానీండి, సాహిత్యం కానీండి, మహాత్మా గాంధి కానీండి—వీటిమీద వీరి అభిప్రాయమే చివరిది, తిరుగులేనిది. దీనికి ఆశ్చర్యపడేవారిని ఒకమాటు హరిణపాటీ గ్రామంపోయి చూచి రమ్మని కోరుతున్నాను. నీరు లేకపోతే చెరువు ఎందుకూ ఎలా కొరగాదో, అలాగే పోద్దార్ లేకపోతే హరిణపాటీకూడా ఎందుకూ కొరగాదని మీరు గమనిస్తారు. పోద్దార్ మహాశయుడు ఈ ఆస్తి సంపాదించటానికి అతని జీవితంలో ఎన్నోరకాల అభిప్రాయాలకు తావు ఇవ్వవలసివచ్చింది. ఈ అభిప్రాయాలే అవసరాన్నిబట్టి అక్కడక్కడా అంటూ తిరగటం ఆయనకు జీవితంలో ఒక క్రీడ ఐపోయింది. ఆయన అభిప్రాయాలు విపులంగా చెప్పటమూ, విమర్శించటమూ ఈ కథకు

అనవసరం. ఐనా పాంచకడీ పోద్దార్‌గారు ఎవ్విధమైన ఆధునిక మార్పులూ ఇష్టపడడని మాత్రం తెలుసుకొని ఉండండి. ఆయనింతవరకు చెప్పులు తొడగటం ఎవ్వరూ చూడలేదు. పాదుకలే వాడుతూ ఉంటాడు.

ఇలాంటి పాంచకడీ పోద్దార్ పుత్రుడైన ఛకడీపోద్దార్ దగ్గర దెబ్బ తిన్నాడు. అతని చిన్నకొడుకు సాత్‌కడి చచ్చిపోయిన తర్వాత అతని భార్య ఛకడీని ఎంతగా నెత్తిన ఎక్కించుకున్నదంటే వాడిప్పుడు కింద వైపుచూడటమే మానేశాడు, పైవంక తప్ప. వాడు కలకత్తా పోయి చదువుకుంటానన్నప్పుడు దూరదర్శి ఐన పోద్దార్ మహాశయుడు అప్పుడే వల్లకాదన్నాడు. బి. ఏ., యమ్. ఏ. పాసయితే పదితలలూ, ఇరవై చేతులూ రాబోయినవా ఏమిటి? వాడంకోసం వస్తాయనే వొప్పుకుం టాము—ఏమి వొరిగింది? ఈ రోజుల్లో అన్ని తలలూ, చేతులూ, పెట్టు కుని ఏం చేసుకుంటాము! కాని భార్య వినలేదు. ఇతని బుద్ధికీ పొరకమ్మి ఆఖరికి ఆడవాళ్ళకి లొంగాడు—ఇప్పుడు చూడండి—కుర్రవాడు లవ్‌లో పడ్డాడు.

౨

కుర్రవాడు లవ్‌లో పడ్డాడంటే మొదట పోద్దారుగారికి ఏమో అర్థం కాలేదు. అతని ప్రియ మిత్రుడైన మాధవకుండు సహాయంతో తన కొడుకు రాసిన ఉత్తరాన్ని అర్థం చేసుకున్నాడు.

అసలు విషయం ఇది:

ఒకనాడు తీరిగ్గా పాంచకడీ పోద్దార్ ఆలోచించి కొడుక్కు ఇరవై రెండోయేడుకూడా వెళ్ళిపోయినా ఇంకా పెళ్ళి చేయలేదనీ, ఇది చాలా అన్యాయమనీ తేల్చుకున్నాడు. పెళ్ళి సంగతి తీసుకువస్తే ఛకడీ చదువుమాట అడ్డుపెడతాడు. కాని వీడిని ఇలా వదలకూడదనీ, బల వంతానైనా పెళ్లి చెయ్యటం కర్తవ్యమనీ, నిర్ణయించుకున్నాడు. ఇది సాధు సంకల్పమని మాధవకుండు కూడా ఆమోదించాడు. యవ్వనంలో పెళ్ళిచేయక పోతే అనుకోని వేవైనా జరగవచ్చు—అందులో కలకత్తా వంటి పట్టణంలో ఉంటూ ఉండగా.

పోద్దార్ మహాశయుడు తన బాల్య మిత్రుడూ, స్వజాతీయుడూ అయిన విశ్వనాథుని కుమార్తెను కోడలుగా తెచ్చుకోటానికి నిర్ణయించుకున్నాడు. చాలాకాలం క్రిందటే విశ్వనాథునితో చాటుగా మాట్లాడి సంబంధం ఖాయంకూడా చేసుకున్నాడు.

విశ్వనాథుడు కలకత్తాలో పెద్ద ఎత్తున వ్యాపారం చేస్తున్నాడు. వ్యక్తికూడా చాలా మంచివాడు. ఈయనకి చాలా ఇష్టం అతనంటే—పైగా బాల్య మిత్రుడు. నాలుగు సంవత్సరాల క్రితం అతను ఈ ఊరు వచ్చినప్పుడు అతనికి మాటకూడా ఇచ్చేశాడు. కాబట్టి ఆ సంబంధం చేయటమే మంచిది. మాధవకుండు కూడా ఇతని అభిప్రాయంతో ఏకీభవించాడు. మాట ఇచ్చినాక అంటే ఈ నాలుగు సంవత్సరాలనుంచీ—పోద్దారూ విశ్వనాథునీ మధ్య ఈపెళ్లికి సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాలు కూడా జరుగుతున్నై. పోద్దారు మహాశయుడు తన కాబోయే కోడలిని గురించి విశ్వనాథునికి ఇలా రాసేవాడు.

"చూడవోయి విశ్వం! పిల్లని అంత ఫేషన్‌బుల్‌గా తయారుచేయకు, స్కూల్లో చదివిన ఈ ఫేషన్‌బుల్ పిల్లలు చేసేపనులు చూస్తుంటే నా వొళ్లు మండుతూ ఉంటుంది. మన అమ్మాయిని ఇంటిపనుల్లో బాగా తయారుచేయి. మా ఆవిడ ఇప్పటికూడా వడ్లు దంచగలదు; మూడు యజ్ఞాలకి వంటచేసి పెట్టగలదు. ఆమె పెట్టిన ఆవకాయ తిని ఊరంతా మెచ్చుకుంటారు. చూడు విశ్వం! అమ్మాయి ఆ దోవను పడకుండా మాత్రం చూడు..."

విశ్వనాథం జవాబు రాసేవాడు.

"నీవు ఈ విషయంలో ఏమీ ఆలోచనలు పెట్టుకోవద్దు. అమ్మాయిని ఇంటిపనుల్లో తయారుచేయటానికి నేనేమాత్రం సంకోచించటంలేదు. నీ కోడలు మసాలాదంచటందగ్గరినించి గుడ్డలు ఉతకటంవరకు—అన్ని విధాలైన ఇంటిపనులూ చేస్తూ ఉన్నది. ప్రస్తుతం అది ఊలు అల్లికా, లేసు కుట్టూ నేర్చుకుంటున్నది. మొన్న ఈ మధ్య పట్టుగుడ్డమీద హంసను కుట్టింది. నిజంగా అది చూస్తే ఆశ్చర్యంవేస్తుంది......"

దీనికి జవాబుగా పోద్దార్ రాశాడు—

"ఊలు అల్లికా, లేసు కుట్లూ మామూలు గృహస్థులకు ఎందుకూ పనికిరావు. పట్టుగుడ్డమీద కుట్టిన ఊలు హంసకూడా ఎందుకు పనికి వస్తుందో నాకు అర్థం కావటంలేదు. నువ్వు బుద్ధిమంతుడివి, చదువు కున్నవాడివి-నీకు ఉపదేశించటం నాకు శోభించదు. కాని నీకు మరీమరీ చెప్పేది ఏమంటే అమ్మాయిని ఫేషన్ బుల్‌గా తయారుచేయమాకు మని. కాలంకూడా బాగాలేదు. మాధవకుండు వార్తాపత్రికలు చదివి ఈనాటి కబుర్లు చెప్పతూఉంటే నాబోటి మూర్ఖుడి బుర్రకూడా తిరిగి పోతూ వుంది—"

తిరుగు టపాలోనే విశ్వనాథుడి దగ్గరినించి జవాబొచ్చేది.

"ఊలు అల్లికా, లేసు కుట్లూ మానిపించేశాను. పట్టుగుడ్డలమీద బొమ్మలు కుట్టడంకూడా అనవసరమే—"

ఈ విధంగా నాలుగు సంవత్సరాలనించి గడుస్తున్నది.

ఛకడీకి ఈ సంగతి ఏమీ తెలియదు.

అతడు కలకత్తా మెస్‌లో ఉండి చదువుకుంటున్నాడు. పెళ్ళి సంగతి వస్తే చదువు పూర్తి అయితే గాని చేసుకోననేవాడు—

కాని మాధవకుండు ప్రోత్సాహమూ సలహామీద కొడుకు బలవంతాన తప్పితే తన ఇష్టంమీద పెళ్లి చేసుకోడని పోద్దార్ నిశ్చయించు కున్నాడు; ఈనాటి కుర్రవాళ్ళ వ్యవహారాలన్నీ అదోకరకం. ఈ సందర్భంలో మాధవకుండు ఈనాటి పాశ్చాత్య విద్యలో ఉన్న దోషాలన్నీ తూరుపార పట్టాడు.

మర్నాడే పోద్దార్ మాధవకుండు చెప్పిన ప్రకారం ఛకడీకి ఉత్తరం రాశాడు. అందులో 17 వ తారీఖున పెళ్ళికి లగ్నం కుదిరిందనీ వెంటనే బయలుదేరి రమ్మని రాశాడు.

## 3

దీనికి జవాబుగా ఛకడీ రాసింది చూసుకొని పాంచకడీ నివ్వెర బోయాడు. పాశ్చాత్య విద్య పరిణామం ఇంత భయంకరంగా ఉంటుం దని అతను ఊహించనుకూడా లేదు. వెంటనే మాధవకుండుకు కబురు

చేశాడు. ఇలాంటివి జరగటానికి ఎలా వీలు ఉందో కూడా అతనికి తోచటంలేదు.

ఛకడీ వ్రాశాడు :—

''నాన్నగారూ! నన్ను క్షమించండి. నేను దాదాపు ఆరుమాసాల క్రిందటే వివాహం చేసుకున్నాను. స్త్రీ విద్యకు ప్రబల విరోధులని మీకీ సంగతి తెలియపర్చలేదు. పిల్ల కొంచెం చదువుకున్నది. మెట్రిక్ పాస్ అయింది. నన్ను క్షమించి అభయంగనక ఇస్తే మేము ఉభయులమూ మీ ఆశీర్వాదం పొందటానికి మీ దగ్గరికి వస్తాము—మిగతా వివరాలు కూడా చెప్పుకుంటాము.''

కుందు రాగానే ఉత్తరం అతని చేతికి ఇచ్చి—''ఛకడీ రాసిన ఉత్తరం! చదివిచూడు—ఇది నాకేమి అర్థం కావటంలేదు. పోద్దార్ వంశంలో ఇలాంటి కొరగానివాడు పుట్టటమా!'' అన్నాడు.

కుందు మాట్లాడకుండా ఉత్తరం చదివి, కాసేపు ఉండి—''లవ్‌లో పడ్డాడు—'' అన్నాడు.

''ఎందులో పడ్డాడు?''

''లవ్—లవ్‌లో—అంటే ప్రేమలో—''

విని పోద్దార్ విస్తుపోయాడు. ఆ తర్వాత—''దీనికి మూలమెవరో తెలుసునా?'' అన్నాడు.

''పాశ్చాత్య విద్య—''

''కాదు, నా భార్య! దానిమాట వినే నేను వీణ్ణి కలకత్తాపంపాను. ఉత్తరం ఏదీ?''

పోద్దార్ ఉత్తరం తీసుకుని పాదుకలు టకటక లాడించుకుంటూ అంతఃపురంలోకి వెళ్ళాడు. భార్యతో జరిగిన సంభాషణ ఇక్కడ రాయటానికి నేను కొంచెం సందేహిస్తున్నాను.

మర్నాడు ఇంకో కాండ జరిగింది. దానికి ఫలితంగా పోద్దార్ మహాశయుడు హారిణహాటీ గ్రామం వదలిపెట్టాడు. ఆ కాండ ఇది. విశ్వనాథుడి దగ్గరనించి ఒక ఉత్తరం వచ్చింది-అతను మర్నాడు వస్తున్నాడట.

దిక్కుతోచని పోద్దార్ మాధవకుందు దగ్గర విశ్వానికి తను ముఖం

చూపించలేనని బయట పెట్టాడు. ఈ హారిణహాటీలో ఉండటం అంత కంటే కష్టమనికూడా చెప్పాడు.

"ఐతే పదరామా, ఒకమాటు బృందావన క్షేత్రమున్నా చూసి వద్దాము. ఒక్క దెబ్బని రెండు పిట్టలు!" అన్నాడు.

పాంచకడీ పోద్దార్ తీర్థయాత్రలకి బయలుదేరాడు. కుందుతో డు.

౪

నిండు ఆరుమాసాలు పోద్దారు మహాశయుడు తీర్థయాత్రలు సేవించాడు. కుందు వెంట ఉండబట్టి ప్రయాణం బాగానే ఉంది. తిరిగి ఇంటికి వద్దామనుకుంటూ ఉండగా, కాశీలో అతనికి విశ్వనాధుడు రాసిన ఉత్తరం అందింది. అది ఇది—

"హారిణహాటీ వస్తే నీజాడ చిక్కలేదు. నీకు ఉత్తరం రాయటానికి కూడా నీవు ఇంట్లో ఏ అడ్రసూ ఇచ్చిపోలేదు. ప్రస్తుతం నువ్వు కాశీలో ఉన్నావనీ, ఇంకా కొంతకాలం అక్కడే ఉండదలచుకున్నావనీ సూచించే ఉత్తరం కుందుగారు హారిణహాటీ రాశాడు. నేను దాని ద్వారానే అడ్రసు సంపాదించి నీకీ ఉత్తరం రాస్తున్నాను. నీకు అన్ని సంగతులూ విప్పిచెప్పటానికి నాకు అవకాశం కలగలేదు. అంచేతనే ఇప్పుడు నిష్కపటంగా ఏమీ దాచకుండా నీకు రాస్తున్నాను-నీ క్షమాభిక్షకూడా కోరుతున్నాను.

"నీవు స్త్రీ విద్యకు విరోధివని నేను నా పిల్లను చదివిస్తున్న సంగతి నీకు వ్రాయలేదు. నిన్ను కలుసుకున్న తర్వాత చల్లగా నీకు చెప్పి ఒప్పిద్దామని అనుకున్నాను. చదువు సంధ్యలు నేర్చుకోవటం ప్రతివారి కర్తవ్యమని నా నమ్మకం. ఇందులో తప్పేమీ నాకు కనిపించటం లేదు.

"చిరంజీవి ఛకడీ చదువుకు కలకత్తా వచ్చినాక తరుచుగా మా ఇంటికి వస్తూఉండేవాడు. కుసుమతో బాగా స్నేహంకూడా కలిసింది. కుసుమ ముందు అతని భార్య కాబోతూ ఉండటంచేత నేనుకూడా వాళ్ళ కలయికకు అడ్డురాలేదు. కాని ఒకనాడు నా భార్య వీళ్ళ కలయిక చాలాదూరం పోయిందనీ, ఇక పెళ్ళిచెయ్యక తప్పదనీ చెప్పింది. నేనా

సంగతి ఒకనాడు ఛకడీకి స్పష్టంగా చెప్పాను. అతను వెంటనే వివాహం చేసుకోటానికి ఒప్పుకోలేదు. పిల్ల చదువుకున్నదనీ, మెట్రిక్ పాసయిందనీ తెలిస్తే కుందుగారి ప్రోద్బలంవల్ల మీరు ఈ వివాహం జరగనివ్వరని, నీ సంగతి నాకూ తెలుసు—అసలే కట్టుమతం వాడివి. ఎదురు తిరగవచ్చు. ఈసంగతులన్నీ ఆలోచించి నీకు వ్రాయకుండానే కుసుమని మీ అబ్బాయికిచ్చి పెళ్ళిచేసాను. ఆరుమాసాలు నిర్విఘ్నంగానే గడిచినై. ఆ తర్వాత పెళ్ళి చేసుకున్నానని నీకు ఛకడీ జవాబు వ్రాయటము చూసి ఇక దాచి లాభంలేదనీ నీకు అన్నీ సంగతులూ వివరంగా చెప్పాలనీ నిశ్చయించుకున్నాను. ఈ ఉద్దేశంతోటే నేను హరిణహాటీ వచ్చాను. కాని తీరా అక్కడికి వచ్చినాక నువ్వు బృందావనం పోయావని తెలిసింది.

"ఇప్పుడు విషయమంతా నీకు వ్రాశాను. నేను నీ బాల్య మిత్రుణ్ణి. నన్ను క్షమించటం నీవల్ల కానట్లయితే వచ్చి రెండు తన్ని అయినాపో. కాని అబ్బాయినీ, అమ్మాయినీ తిరస్కరించమాకు. కుసుమ స్కూల్లో చదివినా ఇంటిపనుల్లో మంచి నిపుణత సంపాదించింది. నీవు స్వయంగా వచ్చి పరీక్షచేసి చూడవచ్చు......" మొదలైనవి.

౨

చాలాకాలానికిగా పోద్దారుగారు హరిణహాటీ వచ్చారు. అతను ఊళ్ళోకి వచ్చి చూసిందేమంటే:—అతను లేని ఈ అదను చూసుకొని కొంతమంది ఊళ్ళో కుర్రవాళ్లు బట్టర్ ప్లయి ఫాషను మీసాలు పెట్టారు. మల్లిక్ గారి ఇంటిముందర కొత్తగా క్రోటన్లు వెలిసినై. పోద్దారుగారు ఏమీ మాట్లాడకుండా కుందుగారి ముఖంవంక చూశారు.

కుందు నవ్వి—"అన్నీ గమనించాను—" అన్నాడు.

* * *

పోద్దారు మహాశయుడు అంతఃపురంలోకి వచ్చి చూశాడు—అతని భార్య ఒక సుందరికి తల దువ్వుతూ ఉంది—కోడలు !

పోద్దారును చూసి ఆయన భార్య ఆదరాబాదరా గుడ్డ సవరించుకుని లేచినుంచుంది. కోడలు పరుగెత్తుకుంటూ ఇంట్లోకి పోయి దాక్కుంది.

"కబురుకూడా చెయ్యకుండా హఠాత్తుగా ఊడిపడ్డారే? సరే—బ్రతికించారు! వొంటో కులాసేనా?" అని అడిగింది భార్య.

పోద్దారు మహాశయుడు వీటికేమి జవాబివ్వకుండా, దగ్గరలో ఉన్న ఉయ్యాలకేసి చూస్తూ—"అదేమిటి?" అని అడిగాడు.

"సాడె! ఛకడీకి కొడుకు పుట్టాడుగా! అమలకుమార్—"

"ఏమిటీ?"

"అమలకుమార్! అమ్మాయి వాడికి అమలకుమార్ అని పేరు పెట్టింది."

పోద్దార్ స్తంభించి పోయాడు.

ఆశ్చర్యం కొంచెం తగ్గినాక అన్నాడు:—"అమలకుమార్‌ను పెట్టుకుని మీరు ఉండండి! నేను కాశీ పోతున్నాను—"

అని నిజంగానే బయలుదేరాడు.

భార్య ఆయనకు అడ్డువచ్చి అన్నది:—"అయ్యో! అదేమిటండీ!—తాత—"

"అమలకుమార్ అనే పేరు నేనెంతమాత్రం సహించను—"

"ఇంకేం, మరింకో పేరు పెట్టుకోరాదూ?"

"నాకడీ—"

"ఛేమ్, అలాగే పిలుద్దాము—"

పోద్దారు మహాశయుడు వెనక్కి తిరిగి ఉయ్యాలవేపు నడిచాడు.



# అద్వితీయం

హాయిగా బతుకుతున్నాను.

ఆఫీసులో దొరా, ఇంట్లో సంతానదేవతా నాయందు ప్రసన్నపై నారు. దొరగారు జీతం పెంచుతున్నారు. సంతానదేవత కుటుంబాన్ని పెంచుతూ ఉంది. నా తల్లిదండ్రులవేపు ఎవ్వరూ లేరు. వారినించి కొంత ఆస్తికూడా సంక్రమించింది నాకు. హాయిగా ఉన్నాను.

ప్రభావతి అనగా నా భార్య సంవత్సరానికి ఒకటిన్నర చొప్పున ఈ నాలుగేళ్ళలో ఆరుగురు సంతానాన్ని కన్నది—ఇందులో రెండు సార్లు కవలపిల్లలు.

ఇలా జనసమృద్ధి అయినప్పటికీ నా కేవిధమైన లోటూ లేదు. హఠాత్తుగా నేను దేవయ్యను మాత్రం అయిపోయాను.

ఐదో సంవత్సరం కూడా మా ఆవిడ అలవాటు తప్పనీకుండా గర్భ భారాన్ని వహించి ఉంది. ఇది ఆమెకు మామూలు వ్యవహారమైనా నాకు సహజంగా కనిపించలేదు. ఎందుకంటే ఆమె చనిపోయింది. ఆమె అప్పుడు కన్నవారింట్లో శాంతిపూర్‌లో ఉంది. నా అత్తమామలు ఎంతో కాలం కిందట చనిపోయినప్పటికి నా బావమరిది వినోదుడు డాక్టరు కావడంచేత ప్రభ ప్రతి కాన్పుకూ అక్కడికే పోయేది! వినోదుడు రాశాడు :—

"హఠాత్తుగా 'ఎక్లెంప్సియా' వచ్చి మా చెల్లెలు కొద్దిగంటల్లో చని పోయింది. నీకు కబురు చెయ్యటానికి కూడా సమయం లేకపోయింది. 'కిడ్నీ' చెడిపోయింది. మా అక్కయ్య పిల్లల్ని తీసుకుని సంబల్‌పూర్ వెళ్ళిపోయింది. బహుశా ఆమె దగ్గరనించి నీకు ఉత్తరం వచ్చి ఉంటుం దనుకుంటాను."

వచ్చిందికూడా. ఆమె రాసింది.—

"ఏమి చెయ్యమంటావు చెప్పు, బాబూ! అంతా రాత! నీ పిల్లల్ని కొంతకాలంపాటు నాదగ్గర ఉండనివ్వు. నేను గొడ్రాలిని. నాకేమీ

ఇబ్బంది ఉండదు. పిల్లలంతా కులాసాగా ఉన్నారు. నీవేమీ విచారించ వద్దు. దైవనిర్దేశం ఎవరు తప్పించగలరు?...

నాకేమి దిక్కుతోచక సెలవుకు దరఖాస్తు పెట్టాను. నా దురదృష్ట వశాత్తు మా దొరకూడా బదిలీ అయాడు. సెలవు మంజూరు కాలేదు!

రెండుమాసాలైనాక—

సంబల్‌పురంలో ఉండే మా వదినెగారి దగ్గరనించి ఇంకో ఉత్తరం వచ్చింది. ఆమె పిల్లల యోగక్షేమాలవీ రాసిన తర్వాత ఇల్లా రాసింది:-

"ప్రభ అదృష్టవంతురాలు; ముత్తయిదువ చావు చచ్చింది. భర్తనూ, కళకళలాడే ఇంటినీ అన్నీ చూసి మరి పోయింది: అలాగని నీ సంసారం ధ్వంసం కావడం నా కిష్టంలేదు. మంచిది కూడా కాదు. నామాట విని, మళ్ళీ పెళ్ళి చేసుకో...ఇక్కడ ఈడొచ్చిన పిల్ల ఒకటి ఉంది, నీకు ఇష్టమైతే చెప్పు. సంబంధం కుదురుస్తాను. నాకుమాత్రం ఆ పిల్ల చాలా ఇష్టం. నీవుకూడా ఇష్టపడతావని నా నమ్మకం!—ఇలాంటివే చాలా సంగతులు."

ఏడురోజులు ఆలోచించి ఒక పౌను టీ, ఐదు టిన్నుల సిగరెట్లూ ధ్వంసంచేసి నేనీ సర్వజన, సర్వకాల సమస్యను పరిష్కరించాను. ఇదే మంత అందనిదికూడా కాదు. నేను వదినగారికి రాసిన ఉత్తరంలో కొంతభాగం ఇదీ :—

"పెళ్లి చేసుకోవాలనే కోరిక నాకు లేదు. ప్రభ నాకు ఎప్పుడూ జ్ఞాపకం వస్తూఉంటుంది. కాని నా ఇష్టానిష్టాలమీద ఆధారపడి ఉండదు ప్రపంచం. దాని ప్రకారం అది నడుస్తున్నది—ఇకముందూ నడుస్తుంది. కాబట్టి సెంటిమెంటల్‌గా నడిచినందువల్ల లాభించటం ఉండదు—శోభించినప్పటికీ—ఈ మాటనిజం. అదీకాక మనం 'మాఫలేషు కదాచన' దేశానికి చెందిన మనుష్యులం. నీవు చెప్తున్నావు కాబట్టి ఇంకోమాటు గృహస్థాశ్రమం స్వీకరించి చూస్తాను!...రెండో సంబంధం చేసుకున్నప్పుడు ఇష్టానిష్టాలతో పనేమి ఉంటుందిలే! నీ కిష్టమైందా..."

క్రమంగా లగ్నంకూడా స్థిరపడింది. సంబల్‌పూర్‌లోనే వివాహం. వదినెగారు తెలివికలది-''పిల్లల్ని లాహోరులో అక్కయ్య దగ్గరికి పంపింది. తండ్రివివాహం వాళ్ళు చూడకూడదట!'' అని రాసింది.

నేను స్వస్థతపడి నిట్టూర్చాను.

యథాసమయానికి దొరగారి కాళ్ళావేళ్ళా పడి ఒకవారం సెలవు సంపాదించి తిన్నగా సంబల్‌పూర్ బయలుదేరాను. ఒక్కణ్ణే! ఈ పెళ్లి సంగతి ఇంకెవరికి చెప్పుకుంటాము? ఏమేమో ఆలోచించి మీసాలు తీసివేశాను. అసలే గుండ్రని నల్లటిమొహం—దానిపైన కలగాపులగంగా పెరిగిన గుబురులాంటి మీసాలు పెట్టుకుని పెళ్లిచేసుకోను బయలుదేరటానికి నాకు ఏదో ఇదిగా ఉంది!

పెళ్ళి పీటలమీద.

మళ్ళీ అలాగే ముసుగువేసుకున్న చీరె కట్టిన పిల్ల నాకు భార్య కాబోతూ ఉన్నది. ప్రభనుకూడా ఒకనాడు ఇదేస్థితిలో చూశాను... ఇప్పుడెక్కడికో వెళ్లిపోయింది. ఇవ్వాళ ఇంకో మనిషి వస్తున్నది... ఈపిల్ల 'కిడ్నీ' ఎలాఉందో ఎవరికి తెలుసు?—ఇలాంటివే ఎన్నో విషయాలు నాకు తలపుకు రాసాగినవి. ప్రభముఖం నాకు మాటిమాటికీ గుర్తుకు రాసాగింది. పిల్లలు ఇప్పుడు ఏం చేస్తున్నారో?... చచ్చిపోయిన తర్వాత నిజంగా ఆత్మ ఉంటుందా?... ఈపిల్ల బాగా ఏపుగా పెరిగినదే—కాని అంత ముడుచుకు కూర్చున్నదేం—తల నేలకి ఆనేటట్టుగా వంచుకుని! ఐతే ఒకవేళ ప్రభ ఆత్మ—గృహ్ణామి! గృహ్ణామి!

యంత్రంలాగా వివాహక్రతువులు నడిచిపోతున్నై. శుభదృష్టి సమయంలో పిల్లముసుగు తీయలేదు. 'పిల్లకు చాలాసిగ్గు'—అని చెప్పింది వదినెగారు. ఎక్కువమంది జనంకూడా రాలేదు పెళ్ళికి. అసలు రెండో పెళ్ళికి ఎవ్వరువస్తారు? ఆ పిల్లకు నా అనేవాళ్ళు ఎవ్వరూ లేరట. ఇతర్ల ఇంట్లో పెరిగినపిల్ల. మా వదినెగారింట్లోనే పెళ్ళిచేసింది—ఆమె చేతిమీదుగానే ఈ వివాహం జరిగిపోయింది. అందుకనే ఈ శుభకార్యం అంతరక్తి కట్టలేదు.

* * *

శోభనంనాటి రాత్రి!

హృదయంలో ఎన్నో ఆశల్నీ, ఆశంకల్నీ పెట్టుకుని గదిలో ప్రవేశించి చూద్దునుగదా, నా ఆరుగురు పిల్లల తల్లి ప్రభ, ఇప్పుడు పుట్టిన ఏడ్రో శిశువును చేతుల్లో పెట్టుకుని పక్కమీద కూర్చుని ఉంది!

నేను స్వప్నం చూడటంలేదుకదా?

"ఛీ, ఛీ, ఆఖరికి అక్కయ్యే గెలిచింది!" అన్నది ప్రభ.

"అంటే?"

"అంటే ఇంకేముంది? ఈమాటు కొన్నాళ్ళు నేను చాలా బాధపడ్డాను. ఆ బాధలో నేను పొరపాటున మా అక్కయ్యతో 'నేను చచ్చిపోతే వారు చాలా కష్టపడతారు' అన్నాను. 'కష్టంకాదు; మూడు మాసాలు వెళ్ళకముందే మళ్ళీ పల్లకీ ఎక్కుతాడు' అన్నది అక్కయ్య. 'ఎప్పటికీ కాద'న్నాను నేను. తర్వాత ఇద్దరం పంచెం వేసుకున్నాము. మా అన్నాయీ, అక్కయ్య కలిసి ఈ పన్నాగం పన్నారు! నేను ఇప్పటిదాకా శాంతిపురంలోనే ఉన్నాను. ఇవ్వాళ సాయంత్రమే వచ్చి చూద్దునుగదా, అక్కయ్యే గెలిచింది. పొరుగు అబ్బాయి రత్నాన్ని పిలిచి పెళ్ళికూతురు వేషం వేసిందట. ఆఖరికి అక్కయ్యే గెలిచింది. ఒకవంద రూపాయలుంటే ఇవ్వండి ఇప్పుడూ! ఛీ, ఛీ—ఏమిటిమీరు! అలాంటి చక్కటి మీసమెందుకు తీయించుకున్నారూ?"

నా అవస్థ వర్ణించ తరంకాదు!

* * * *

ఆ మర్నాటి ఉదయం వదినెగారి అప్పు తీర్చాము. ఇక మళ్ళీ మీసాలు వస్తే బతికిపోతాను!



# పదిరూపాయల కోసం

"ఎబ్బే! ఫర్వాలేదు. ఉంచుకోండి. చేతులో ఉన్నప్పుడు ఇద్దురు గాని, అంత తొందరేమీలేదు" అన్నాడు విధుబాబు మొహమోట పడుతూ.

నిఖిలబాబు అంతకంటే మొహమోటపడుతూ అన్నాడు:-"ఉహుఁ, తొందరకాక ఏముందిలెండి! దీనికోసం మిమ్మల్ని మూడుమార్లు తిప్పాను. నిన్నరాత్రే డబ్బుకూడా తెచ్చిపెట్టాను, మీకు ఇద్దామని. కాని పొద్దున్నే బోసుగారు వచ్చి నా గొంతుమీద కూర్చున్నారు. బెనారెసులో వాళ్ళ అబ్బాయి జబ్బుపడ్డాడట—తంతి వచ్చిందట—కొంచెమైనా డబ్బు పంపకపోతే—"

"ఓ ఇవ్వటం చాలా మంచిపని! అంత అవసరం వచ్చినప్పుడు ఇస్తే ఎవరు కాదంటారు! సరే, ఆయన ఇచ్చినప్పుడే ఇవ్వండి. ఇవ్వాళ విపినుడు ఏమన్నా సర్దుకుంటాడేమో చూస్తాను. ఇవ్వాళ నాకుకూడా డబ్బు కొంచెం—" అంటూ విధుబాబు లేచాడు.

విధుబాబు గడప దాటగానే నిఖిలబాబు ముఖభంగిమ మారిపోయింది. "మాదిగముండాకొడుకు! నాలుగు రూపాయలకోసం నిద్ర కూడా పోనివ్వటంలేదు!" అని మనస్సులో తిట్టుకున్నాడు.

బయటికి వచ్చి విధుబాబుకూడా ముఖభంగిమ మార్చుకున్నాడు. "పీనాసి ముండాకొడుకు తిప్పి చంపేటట్టు ఉన్నాడు" అని లోలోపల తిట్టుకున్నాడు.

* * *

కాలం ఒకరికోసం ఆగదుకదా. జరుగుతూనే ఉంటుంది. ఒకవారం గడిచింది. విధుబాబు ఒకనాటి ఉదయం మళ్ళీ నిఖిలబాబు ఇంటికివచ్చి దర్శనమిచ్చాడు. దాదాపు మూడుమాసాలక్రితం విధుబాబు నిఖిలబాబుకు పదిరూపాయలు చేబదులు ఇచ్చాడు. "రేపు ఉదయమే ఇచ్చేస్తాను" అనేమాటకూడా తీసుకొన్నాడు. కాని గ్రహాలు వక్రించటం వల్ల నిఖిలబాబు ఒక ఆఫీసుకు మేనేజరైకూడా మాట నిలుపుకోలేక

పోయాడు—అదీ పదిరూపాయల దగ్గర—విధుచరణబోసువంటి లోఫక్ ముందు! "అయ్యో! కలిపురుషుడా నీకు నమస్కారం పెడతాను. నీవు నలమహారాజులాంటి విచక్షణబుద్ధి కలవాణ్ణే ముక్కుకు తాడుపోసి ఆడించావు. ఇక నాబోటివాడి బిసాతెంత?"—ఇదీ నిఖిలబాబుకు మన శ్శాంతి. చిన్నతనంలో నిఖిలబాబు మహాభారత కథలంటే చెవి కోసుకునే వాడనే ప్రతీతి ఉంది!

విధుచరణుడు రాగానే నిఖిలుడు ప్రదర్శించిన ముఖభావాన్ని బట్టి చూస్తే—ఈయన ఎంతో కాలంనుంచి విధుచరణుని రాకకోసం ఎదురు చూస్తున్నట్టుగా ఉంది.

"బతికిపోయాను! రండి విధుబాబుగారూ! మీసంగతే అనుకుంటూ ఉంటాను. ఇవ్వాళ మావీధిలో భాగవతం, వస్తారా చూడ్డానికి? సరైన స్నేహితుడు తోడులేంది ఇల్లాంటివి చూడటానికి బాగుండవు."

ఏదో ఆకాశంలో ఉన్న చంద్రుడు వచ్చి వళ్లో పడ్డట్టు, విధుచరణుని మొహం ఆనందంతో ప్రకాశించింది. అతను మెరుస్తున్న కళ్లను పైకెత్తి-"అలాగే, అలాగే! ఎన్నింటికీ?" అన్నాడు.

"ఎనిమిదింటికి, రాత్రి."

"వస్తాను తప్పకుండా."

ఈ సమయంలో నిఖిలబాబు కూతురు మింటూ, ఏడు ఏళ్లపిల్ల వచ్చి-"నాన్నా అమ్మ పంచదార అయిపోయిందని చెప్పమంది నీకు" అన్నది.

విధుబాబు మింటూను చేయిపట్టుకు దగ్గరకు తీసి మాట్లాడటం మొదలు పెట్టాడు. ఇంత ఓర్పుతో ఆయన తన కూతురుతో కూడా మాట్లాడి ఎరుగడు.

"పాపా! నీ ఫ్రాక్ ఎంత చక్కగా ఉందమ్మా! జడ రిబ్బనుకూడా భలేబాగా ఉంది!"-ఇలాంటి ఊసుపోని సంభాషణతో ఇంకా కొన్ని నిమిషాలు గడిచినై.

విధుబాబు ఇక్కడికి రావటానికి ముఖ్యకారణం ఆ పదిరూపాయలు. కాని నోరు తెరచి అడగలేక పోయాడు. ఏదో ఒక సాకుతో కాలం జరప మొదలుపెట్టాడు-ఈ లోపల నిఖిలబాబే ఆ ప్రసంగం తేవచ్చు నని అతని ఆశ. విధుబాబుకు మొహమోటం జాస్తి!

నిఖిలబాబుది మహాభారత ప్రకృతి. ఆయన అసలు ఆ జోలికే

పోలేరు. ఈసంవత్సరం ఫతేపూర్ సిక్రీలో చలి ఎంత జాస్తిగా ఉన్నదీ, బీదవాళ్ళు అక్కడ గుడ్డలు లేక ఎంత బాధపడుతున్నదీ చెప్పి చాలా జాలిపడ మొదలుపెట్టాడు.

గడియారం తొమ్మిది కొట్టింది.

“ఐతే యిక ఆఫీసుకు పోవటానికి తయారుకావాలి” అన్నాడు నిఖిలబాబు.

“బోసుగారు ఆ డబ్బు తిరిగి పంపరా?” అని అడిగాడు విధుబాబు సగం చచ్చి.

నిఖిలబాబు అప్పుడే నిద్రపోయి లేచినట్టు—“ఓ, నేనా సంగతి మరిచేపోయాను. మీకోసం నేను డబ్బుకూడా వేరేపెట్టి ఉంచాను!” అని ఆయన జేబులో చెయ్యిపెట్టి—

“అరే! కనపడదే! ఎక్కడ పారేశానబ్బా!” అని జేబులు వెదకటం మొదలుపెట్టాడు. చిత్రమేమంటే తాళం చెవి దొరకలేదు. విధుబాబుకూడా వెతికి చివరికి విసుకుపుట్టి-“సరే, రేపు నిమ్మళంగా చూచుకోవచ్చు, అంత ఆదుర్దా ఎందుకులెండి!” అన్నాడు.

* * *

అనుకున్న ప్రకారం విధుబాబు సాయింత్రం వచ్చాడు - నిఖిలబాబు ఇంట్లోలేడు. విచారించగా ఆయన ఏదో అవసరమైన పనిమీద బయటికి వెళ్ళాడనీ, ఎప్పుడు తిరిగి వస్తాడో కూడా తెలియదనీ తేలింది. విధుచరణుడు ఒక్కడే కూర్చుని భాగవతం చూశాడు. ఉత్తర అభినయం అతనికి బాగా నచ్చింది. శరీరంతోపాటు మనస్సుకు గాఢమైన సంబంధం ఉన్నదనే విషయం ఎవ్వరూ కాదనటానికి వీలులేదు. దానికి ప్రమాణం కూడా లభించింది. ఉత్తర దుఃఖం చూసి యీయన కన్నీరుకార్చాడు. మర్నాడు లేచి చూస్తే ఆయన హృదయంలో దుఃఖం గొంతుకు వచ్చి పట్టుకున్నట్టుగా ఉంది. నోటి ఉమ్మి మింగటానికికూడా బాధగా ఉంది. ఆయన టాన్సిల్సు రెండూ ఉబ్బినవి. మామూలుగా ఆరంభమైన జ్వరం మూలను పడవేసింది. విధుబాబు మంచంలో పండుకుని ఆలోచించ మొదలుపెట్టాడు:-నిఖిలబాబును చూడటానికి పోకపోయినట్టయితే ఈ భాగవతం చూసేవాణ్ణి కాదుగదా!-అదీ, అసలు ఈ పదిరూపాయలూ బదులు ఇవ్వకపోతే ఆయన్ను చూడటానికిమాత్రం ఎందుకు పోయే

వాణ్ణి...ఈ విధంగా ఆయన బేరీజు వేసి చూసుకుని "ముండాకొడుకు నా ప్రాణమూ ధనమూ లాగివేసేటట్టు ఉన్నాడు!" అని తిట్టుకున్నాడు.

విధుచరణుడు ఒకవారంపాటు మంచంమీద ఉన్నాడు. అతనికి మందు క్రిందా, వాటిక్రిందా కలిసి మొత్తం 17-13-9 ఖర్చు అయింది.

ఇది జరిగి ఒకమాసం అయింది. ఎందుకంటే ప్రపంచం బెంగాలీజాతి కాదు. అది నియమప్రకారం తన కక్ష్యలో తిరుగుతున్నది. నియమ ప్రకారం రాత్రింబవళ్ళు వస్తున్నై-పోతున్నై.

ఆనాడు ఆరో తారీఖు. నిఖిలబాబు కిందగదిలో కూచుని మనసులో లెఖ్ఖలు వేసుకుంటున్నాడు. నిన్ననే అతనిచేతికి జీతం వచ్చింది, నాగాలకీ వాటికీ పోను, రూ. 55-7-6. ఇందులో 15/-ఇంటి అద్దె ఇవ్వాలి. 20/-చిల్లర అంగట్లో ఇవ్వాలి. ఇక 20-7-6 ఉంటుంది. ఇందులో 0-7-6 తీసివేస్తే 20-0-0 ఉంటై. వీటిలోనించే ఈ మాసానికి కూరగాయల ఖర్చూ, పిల్లలజీతం, పాలదానికీ, కిరసనాయిలు ఖర్చూ గుడ్డల ఖర్చూ పెట్టవలసి ఉంటుంది.-ఊహుఁ-ఈ మాసంకూడా విధుచరణునికి డబ్బు ఇవ్వటం అసంభవం!

పెళ్ళాందగ్గరమాత్రం కొంచెం డబ్బు ఉంది. బజారు ఖర్చుల్లోంచి, కానీ, అర్ధణా పిక్కి కొంతడబ్బు వెనకవేసింది. కాని అది ఎంతఉందో సరిగ్గా నిఖిలుడికి తెలియదు; అదికాక ఈ నాలుగు డబ్బులుకూడా తన భార్యనుంచి వొడుకోటం అతనికి కొంచెం కష్టంగా తోచింది. అసలు అడుగుదామనుకున్నా కారణం ఏమి చెప్పతాడు!

అతను విధుబాబుదగ్గర డబ్బుతీసుకున్నది గుర్రపు పందేలకోసం. ఇక ఓడిపోయాడని వేరే చెప్పటం అనవసరం. ఈ సంగతి భార్యదగ్గర బయటపెట్టటానికీ వీలులేదు. నిఖిలుడు ఎదోవిధంగా మ్యానేజ్ చేసి విధుబాబుకు డబ్బు ఇద్దామని అనుకున్నాడు. కాని అతను ప్రతిమాసమూ మనసులో లెఖ్ఖలువేసి చూసుకుంటుంటే మ్యానేజ్ చేయటం అసంభవమని తేలిపోతూ ఉంది! ఇటు ఏవేవో సాకులుచెప్పి ప్రతిసారి విధుబాబును సాగనంపడం అంతకంటె కష్టంగా వుంది. ప్రతిపనికీ హద్దు అనేది ఒకటి ఏడ్చింది...నిఖిలబాబు ఈ ఆలోచనలో తేలిపోతూ ఉండగా బయట రోడ్డుమీద విధుబాబు గొంతు వినిపించింది:—

"ఇక్కడికే! ఒకమాటు నిఖిలబాబు దగ్గరకు పోతున్నాను!"

నిఖిలుడు ఏమి చెయ్యాలో దిక్కుతోచక చప్పునలేచి ప్రక్కనున్న మెట్లగదిలో జొరబడి గడియ వేసుకున్నాడు.

* * *

"నిఖిలబాబూ!"

మింటూవచ్చి-"నాన్నగారు ఇప్పటిదాకా ఇక్కడే కూర్చున్నారు! ...ఐతే బయటికి పోయారేమో!" అన్నది.

"సరే వారు వస్తే నేను వచ్చిపోయానని చెప్పు!"

"అలాగే!"

విధుబాబు వెళ్లిపోయాడు. విధుబాబు వెళ్లాడో లేదో "అమ్మ బాబో! చంపిసై...ఉష్, అబ్బ!" అంటూ నిఖిలుడు గదితలుపు తెరుచుకుని బయటపడ్డాడు. ఆ మెట్లగదిలో కందిరీగల తుట్టె ఉంది. అవి రేగి నిఖిలబాబు ముఖమంతా చెడకుట్టినై. ఆయన కూజాలో నీళ్ళుతీసి ముఖమంతా తడుపుకోసాగాడు. చూస్తూఉండగానే ఆయన ఎడమ కనురెప్ప ఉబ్బి కన్నును మూసివేసింది. మెడ కుడివైపు ఉబ్బి నాన్ రొట్టెలాగ తయారైంది. మింటూకు నవ్వు వచ్చింది. నిఖిలబాబు పైకి పోయి మంచమెక్కాడు.

సరిగ్గా ఈ సమయంలోనే ఇద్దరు మనుష్యులు విధుబాబును తీసుకు వచ్చారు! ఏవిధంగా నిఖిలబాబు దగ్గరనుంచి డబ్బు వసూలుచేయాలా అని ఆలోచిస్తూ పరధ్యానంగా విధుబాబు రోడ్డున పోతున్నాడు. రోడ్డుమీద అరటికాయతొక్క ఉండి విధుబాబు కాలుజారింది. ఆయన బొక్కబోర్లా రోడ్డుమీద పడ్డాడు. తల చిల్లిపడింది, చేయితొలిగింది, ఇద్దరు బాటసారులు ఆయన్ని అతి కష్టంమీద నిఖిలబాబు ఇంటికి చేర్చారు. ఎందుకంటె ఆయన ఇల్లు చాలా దూరం.

నిఖిలుడు పైన పండుకుని ఉన్నాడు. పిలవగా పిలవగా కిందికి దిగివచ్చి కుడికంటితో చూశాడు—మళ్ళీ విధుబాబు ప్రత్యక్షం.

ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకున్నారు. ఇద్దరి నోటనించీ ఒక్కసారిగా—"నన్ను బ్రతికించు బాబూ!" అని వెలువడింది.

మరో మూడుమాసాలు గడిచినై.

నిఖిలబాబు ఇంకా డబ్బు ఇవ్వలేదు.

విధుచరణుడు ఇంకా తిరుగుతూనే ఉన్నాడు.

# అనిర్వచనీయం

క్షణికా కాస్తగీర్ తలపైన పిడుగుపడింది. ఇంకా ఆమె చచ్చిపోలేదు. కాని యీ స్థితిలో తను చావటం ఉచితమా, కాదా? ఉచితమైనట్లయితే బాధలేకుండానూ, రొమాంటిక్‌గానూ చావటానికి యేపంథా అవలంబించాలి?—అనే విషయం ఆలోచిస్తూ ఆమె మేడమీద పచార్లు చేస్తున్నది.

కిరసనాయిలు, గొంతుకు ఉరి, చెరువులోపడటం, యివన్నీ యేమిటి? ఆఖరికి సైనేడ్‌కూడా పాతబడిపోయింది! క్షయక్రిములున్న పాలిస్తే?

హఠాత్తుగా వెనక రమేష్‌బాబు చెప్పుల చప్పుడు.

"క్షణీ! ఇక్కడున్నావా నువ్వు? సరే!—ఏమిటి నీ పిల్లతనం చేష్టలు?"

క్షణిక ఏమీ జవాబు చెప్పలేదు.

"మాట్లాడటమేలేదే! ఐతే యిప్పుడే అతనికి మాట యిచ్చెయ్యమంటావా?—లేదంటే కొంచెం ఆలోచించి చెప్పు, తప్పేముంది?" అన్నాడు రమేష్‌బాబు.

"ఆఖరికి నువ్వు నన్ను ఒక రెండో సంబంధం వాడికి యిస్తావని నేను అనుకోలేదు నాన్నా!" అన్నది క్షణిక.

"సరే! అయితే చేసుకోమాకు! నాకు కుర్రవాడు నచ్చాడు; అందుకని చెప్పిచూశాను. బాగా చదువుకున్నవాడు; మంచి ఉద్యోగం చేస్తున్నాడు; ఆరోగ్యంకూడా బాగావుంది. పిల్లా జల్లాలేరు. రెండో సంబంధమయితే యేం? సరే నీకంత యిష్టంలేకపోతే చేసుకోమాకు. ఇక పద, పోయి పండుకో! చదువుకున్నందువల్ల నీకు టాన్సిల్సు పెరగటం తప్పితే, తెలివితేటలేమీ పెరిగినట్టు కనిపించటంలేదు!"—మాతృభావంలోవున్న రమేష్‌బాబు, తల్లిలేని తన కూతుర్ని తీసుకుని క్రిందికి దిగివెళ్లాడు.

చెప్పటం మరచిపోయాను,—అసలు ముందే చెప్పవలసింది—
కా స్టగీర్ 'ఆనర్స్' తీసుకుని బి. యే. పాసయింది. ముఖ్యమయిన
పత్రికల అన్నింటిలోనూ ఆమె ఫోటో ప్రచురింపబడింది.

మర్నాడు—క్షణిక, ఆమె స్నేహితురాలు సుజాతతో అన్న
"పోనివ్వు, యీ కండం గడచిపోయింది! అసలతని తెలివికి
వాలి—చావబోయేముందు పెళ్ళికి బుద్ధిపోయినందుకు! మ
మనల్ని సిగరెట్లక్రింద జమకట్టారనుకుంటాను. ఒకటి అయి
ముందే రెండోది ముట్టించాలనుకుంటారు! ఈ మహానుభావు
తొందరభాయిలాగా వున్నాడు! భార్య కాష్టంనించే నిప్పు తీ
పెళ్ళికి హోమగుండం వెలిగించాలని చూస్తున్నాడు!"

"ఏమిటి అసలుసంగతి?—ఎవరా పెద్దమనిషి?" అని
సుజాత.

"ఆయనపేరా? అజయకుమారబోసట! గవర్నమెంటు
అట—కవిత్వంకూడా రాస్తాడట. కావ్యరసం కొంచెం
అయి—" అని ఆవేశంతో చెప్పుకుపోతున్నది.

"అలాగా" అన్నది సుజాత చెప్పేది కాకముందే.

క్షణిక ఆవేశం యింకా తగ్గలేదు. చెప్పుకుంటూ పోయింది.

"చట్టం ఒకటి ప్యాసుచేసి యిలాంటి పెళ్ళిళ్ళు ఆపించటం
నే ననుకుంటాను!"

సుజాత యేమీ మాట్లాడలేదు.

ఆమె అప్పుడేమీ మాట్లాడనిమాట నిజమే—కాని యీ
తను యెంతమాత్రం అనుకూలం కాదని నిరూపించింది.

ఒకమాసం గడిచినాక సుజాతాదేవి అజయబోసుల పరిణయ
త్సవానికి మిత్రులంతా ఆహ్వానింపబడ్డారు.

* * *

స్నేహితురాలి భర్త. పరిచయంకాకుండా యెట్లా వుంటుం

నాడు మాటమీదవచ్చి క్షణిక అజయబోసుతో నవ్వుతూ అన్నది:—
"మీరు చిన్నతనంలో 'ట్రై, ట్రై, ఎగైన్' అనే పద్యం బాగా చదివారనుకుంటాను!"

"ఎందుకు చదవలేను! అదీకాక, నా మొదటిభార్య చచ్చిపోయిన తర్వాత, గొప్పగొప్పవాళ్ళంతా నన్ను రాత్రింబగళ్ళూ వేధించసాగారు. షెల్లీ, బైరన్, మొపాసా, రవీంద్రుడూ అంతా నన్ను బలవంత పెట్టిన వాళ్ళే—ఆఖరికి మన సత్యేన్ దత్తుకూడా—నా పెళ్ళికి ఉమర్ ఖయ్యామ్ బహుమతి యిచ్చిన అతను నన్ను అసలు వదిలేవాడే కాదు! చూడండీ! వాళ్ళ మర్యాద దక్కించాలంటే నేను రెండో పెళ్ళి చేసుకోకుండా యేమిచేసేది?...అన్నాడు" అజయబోసు.

"చాలు, యిక ఆగండి! మిమ్మల్ని అర్థంచేసుకున్నాను" అన్నది క్షణిక యెర్రబడ్డ ముఖంతో.

కాని అజయుని జవాబులో తెలివితేటలూ, ప్రతిభా ఆమె మెచ్చుకోకుండా వుండలేకపోయింది. అతను రసికుడు—సుజాత సుఖపడుతుంది.

* * *

కొన్నాళ్లయిన తర్వాత సుజాత ఆత్మహత్య చేసుకున్నదని తెలిసింది. ఆ తర్వాత కొన్నాళ్లకు అజయబాబు మళ్ళీ వివాహం చేసుకోబోతున్నాడని తెలిసింది—ఈమాటు క్షణికా కాస్తగీర్ నట!—లవ్ మ్యారేజ్.



# సనాతనపురంవాసులు

లీడరు శైలేశ్వరబాబు హఠాత్తుగా కనిపించకుండాపోయాడు. ఆయన కొంచెం ప్రాయం మిగిలినవాడుకూడా. ఇదేకారణం చాలు ఆ గ్రామస్థులు ఆందోళన పడటానికీ, ఉత్తేజితులు కావటానికీ. పత్రికలో ఆయన బొమ్మవేయించీ, సభలుచేయించీ, కవిత్వాలు రాయించీ సనాతన పురవాసులు అనాయాసంగా తమ ఉద్రేకాన్ని వెలి పుచ్చవచ్చు. కాని ప్రస్తుతం వారికేమీ చేయటానికి వీలులేకపోయింది. అందుచేతనే వారు ఒకరిచెవిలో ఒకరు చెప్పుకుని సంతృప్తిపడ్డారు. ఎందుకంటే, అతనితోపాటు చాకలి శ్యామకూడా కనపడకుండా పోయింది.

ఊళ్ళో పెద్దలూ, శైలేశ్వరుడి హితైషులూ ఈ వార్తను అణిచివేయటానికి తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. హోల్‌దార్ గారు కనపడ్డవారికెల్లా శైలేశ్వరుడు కేసు విషయంలో 'ఖుల్నా' పోయాడనీ, పోయేటప్పుడు తను చూచాననీ చెప్పుతున్నాడు.

ఇది సర్వ అబద్ధం—ఏళ్లువచ్చిన హోల్‌దార్ గారు ఇది ప్రచారం చేస్తున్నప్పటికీ. ఎందుకంటే, ఈ హోల్‌దార్ గారే సాయంత్రం, ముసలి భాదుడీని కలుసుకున్నప్పుడు—'ఛి, ఛీ! ఆఖరికి మన శైలేన్ ఇలాంటి పని చేశాడేం?' అన్నాడు మెల్లగా అతనితో.

ఈ విషయంలో భాదుడీమహాశయుడుకూడా ఏమీ అభిప్రాయభేదం సూచించలేదు. ముక్కుమొహం కుదించుకుని— "అరే, ఆ సంగతెందుకు తెస్తావు, ఛా, ఛా!" అన్నాడు.

అన్నాడే కాని అంతటితో ఆగలేదు. మళ్ళీ వెంటనే మహా ఉత్సాహంతో—"సరేగాని, ఆ చాకలిదాని పేరేమిటో!" అన్నాడు.

ఈ విషయంలో ప్రతి చిన్న వివరమూ హోల్‌దారికి బాగా తెలుసునన్నట్లు ఆయన చెప్పిందాన్నిబట్టి తెలుస్తుంది. ఆయన ఆ చాకలిది ఉండే చోటూ, దాని ఆకారమూ, వయసూ, దాని స్వభావమూ, నడతా విషయమై పెద్ద ప్రమాణానికి పోకుండా చిన్న లెక్చరు ఇచ్చి దానికి ఉప

సంహారంగా ఇలా చెప్పాడు:—"శైలేన్ లోలోపల ఇంత కాండ జరుపుతున్నాడని ఎవరికి తెలుసూ? అంత పెద్ద కొడుకూ, అంత పెద్ద మాతురూ?"

భాస్కడీగారు ఇక వినలేక—"ఛా, ఛా! లోకులు నవ్వుతారనికూడా లేదు!" అన్నాడు.

చాకలి శ్యామ లేచిపోయేనాటి కిందటిరోజున దాని మొగుడు పేరాయిచేతులో దెబ్బలు తిన్నదని, మల్లిక్ కక్కాయి ఎలాగో అతి తెలివిగా ఈ సంగతి కూపీతీశాడు. మల్లిక్ కక్కాయికూడా శైలేశుని మేలుకోరేవాడే. అతను చాకలి పేరాయిదగ్గరికిపోయి, "ఈసంగతి ఎవ్వరిదగ్గరా బయట పెట్టమాకు, తెలిసిందా?" అన్నాడు.

పేరాయి ఆశ్చర్యంతో "ఏసంగతీ?" అని అడిగాడు.

మల్లిక్ మహాశయుడు దిమ్మెరబోయి, మాటలు తడబడగా, అక్కడే నించి తప్పుకుని వాళ్ళగుంపులో వచ్చి కలిసి, జరిగిన వ్యవహారం బయట పెట్టాడు. బయటపెట్టటమే తడవుగా అంతా మల్లిక్‌మీద విరుచుకు పడ్డారు! ఎందుకు అతను చాకలి పేరాయి దగ్గరికి పోవాలీ? ఏమిటీ తెలివితక్కువా?

మల్లిక్ చేసిన తెలివితక్కువ పని సర్దటానికిగాను తెలివితేటలు గల ముఖర్జీగారు, తనకుదానై బయలుదేరి చాకలి పేరాయిదగ్గరికి పోవలసి వచ్చింది. అమాయకుడైన మల్లిక్‌మీద లేనిదోషం ఆరోపించి చెప్ప వలసివచ్చింది:—"మల్లిక్ మాటలు ఏమీ పట్టించుకోమాకు, పేరాయి. అతను భంగుతాగి అని ఉంటాడు" అన్నాడు.

ఈమాటుకూడా పేరాయికి ఆశ్చర్యం కలిగింది:—"అంటే? ఏమిటి తను చెప్పిందీ?" అన్నాడు.

ముఖర్జీ పళ్ళు ఇకిలించి—"అంటేనా? ఏమీ లేదులే!—తెలిసిందా? ఆc?" అని ఆనాడు చల్లగా తప్పుకువచ్చి గుంపులోకలిసి—"అబ్బ! పేరాయి పిచ్చికుక్కలాగా, తయారయాడోయ్! ఈమాటు మన మల్లిక్ తాచుపామును తొక్కాడు!" అన్నాడు.

ఇక అందరికీ కోపంవచ్చి మల్లిక్‌మీద కత్తులు నూరారు! మల్లిక్ పాపం ఆగుంపు వొదిలి ఒక్కడే తప్పుకు తిరగసాగాడు. పేరాయి

కుతావాళ్లు మల్లిక్ దూరదూరంగా తిరగటంచూసి, నవ్వుతున్నారు. ఈమధ్య భంగులు ఎక్కువగా తాగుతూ వుండవచ్చునని కూడా అనుకున్నారు!

ఏమైనా కానివ్వండి. శైలేశ్వరబాబు బంధువులూ, హాల్దారూ, ముఖర్జీమొదలైన పెద్దలంతా ఒక్కటై, ఒక్కగొంతుతో శైలేశ్వర బాబు ఖుల్నాపోయిన విషయం సమర్థించటం మొదలుపెట్టారు. కాని తోలోపలమాత్రం భాదుడీ కుతూహలుడూ, ముఖర్జీ ఉత్తేజితుడూ, హాల్దార్ విస్మితుడూ, మల్లిక్ కుపితుడూ అయారు.

ఇది శైలేశుని హితులసంగతి. కాని సనాతనపురం చిన్నది కాదు. తరతరాలనించీ, ఉన్న కుటుంబాలు ఎన్నో ఉన్నాయి ఆ వూళ్ళో. కచేరిచావిళ్లుకూడా రెండు ఉన్నాయి ఆ వూళ్లో. అంచేతనే అతనికి విరోధివర్గంకూడా ఉంది ఆవూళ్ళో. శైలేశ్వరబాబు సత్యవాది, పరోప కారి. తనపని తాను చూసుకునేవాడు, గొప్పవాడు. వీటికి అనుగుణ్యం గానే అతని శత్రువర్గం కూడా ఎక్కువగానే ఉన్నారు. వారి కిప్పుడు మంచి అదను చిక్కింది, శైలేశ్వరుడూ-చాకలిదాని వ్యవహారం-దానికి రంగారంగు కలర్ ఇచ్చి ప్రచారం చేయటం సాగించారు.

ఒకతనువచ్చి-"శైలేశ్వరబాబు ఖుల్నా పోలేదని చెప్పుతున్నారే, హాల్దార్ గారు!" అన్నాడు.

హుక్కా రెండుమూడు పీల్పులు పీల్చి రాయ్ మహాశయుడు-"ఐతే నువుపోయి హాల్దార్ తో సూర్యుడింకా పొడవటంలేదని చెప్పు!-మా కంతా తెలుసు-"అన్నాడు.

తల ఎగురవేసి, మందహాసంచేస్తూ లాహిడీ మహాశయుడు అన్నాడు. "ఎందుకండీ అంతకోపం! ఇట్లాంటిమాటలు హాల్దార్ కాకపోతే ఇంకె వరు చెప్పుతారు. అసలు వాళ్ళుమిగా వాళ్ళంతా అంతే. మిత్రా ఉన్నాడే-అన్నెళ్ళు వచ్చినై-మొన్న చాటుగా తాగి తిరుగుతున్నాడు. పైగా ఆయన పంతులట "భాదుడీమాత్రం తక్కువగా? ఆయన గోజూ నాళ్ళ చెరువుదగ్గర తిరుగుతూ ఉంటాడు, ఎందుకూ?"

వృద్ధ గోస్వామి ఇంతవరకు ఏమీ మాట్లాడలేదు.

"అంతా శ్రీవైష్ణవులే!" అన్నాడు ఈమాటు క్లుప్తంగా.

"ఈమాటు శ్రీవైష్ణవుడు చిక్కాడులే!" అని రాయ్‌మహాశయుడు పలుకొక్క గోస్వామికి ఇచ్చాడు.

*     *     *

## ౨

దీనికి ఫలితంగా కొద్దిరోజుల్లోనే శైలేశ్వరబాబును అడ్డంచేసుకుని భాదుడీమీదరాయీ, రాయ్‌మీద ముఖర్జీ, ముఖర్జీగారిమీద గంగూలీ తిరగబడటం సాగించారు.

కలలోకూడా అనుకోనటువంటి విషయాలన్నీ శైలేశ్వరుడిమీద ఆరోపించబడినై. చాలామంది అభిప్రాయం అతను కలకత్తా పోయాడని, కాని వీళ్ళకి ఎదురుగాకూడా ఒకపార్టీ ఉంది. వీళ్ళేమంటారంటే ఆయనమాత్రం రైలెక్కి ఎక్కడికీ పోలేదు. ఎందుకంటే అతను రైలెక్కడం స్టేషనులో ఉన్నవాళ్లు ఒక్కరుకూడా చూడలేదు. కొబట్టి ఆయన కాలినడకనేపోయి చాకలిదానితోపాటు ఎక్కడో తల దాచుకున్నాడని వాళ్ళ అభిప్రాయం! "శైలేశ్వరబాబు చాకలిదాన్ని వీపు నెక్కించుకుని, చేలల్లోగుండా పరుగెత్తుతూ ఉండడం నేను స్వతహాగా చూశా"నని ఒకడు నొక్కి చెప్పాడు!

## 3

శైలేశ్వరునిభార్య, కొడుకూ కూతురుతోపాటు కన్నారింట ఉన్నది. కాని ఈవార్త దావానలంగా అక్కడికి చేరేవరకు ఆమె చకితురాలై, భయపడి ఇంటికి చక్కా వచ్చింది! కాని ఇక్కడికివచ్చి ఆమె ఇంకా తిరుగుడులో పడింది. ఆమె ఈడుస్త్రీలంతా ఆమెను ఓదార్చినట్టుగా దగ్గరికివచ్చి, చిత్ర చిత్రమైన మాటలన్నీ సులువుగా అనేసి పోయారు. ఒకావిడే—"అయ్యో, ఎవరన్నావింటే సిగ్గుతో చావవలసిందేగాని ఇంకేమన్నా ఉందా!" అని బుగ్గను వేలుపెట్టుకుని మెడవంకరగా పెట్టింది.

"మగవాళ్ళని నమ్మకూడదు చెల్లీ! ఎంతమాత్రం నమ్మకూడదు!— మనం మొహంఎదట లేకపోయామంటే ఇక చెయ్యి జారిపోయినట్టే!" అన్నది గంగూలీ భార్య.

హాల్దారుభార్య సానుభూతి కొంచెం చూపుతూ—"మావారు వీరు ఖులాసా పోయారని గామాలు చెప్పుతున్నారు!" అన్నది.

ముఖర్జీభార్య గద్దిస్తూ—"ఇక ఆపవే. చాలు నీ తెలివి! మా ఆయన మాత్రం అనటంలా! దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్నారట!—నేను అందుకనే చెప్పేశాను—ఇక వాళ్ళల్లోపోయి కలిస్తే నేను ఎంత మాత్రం ఊరుకోనని! ముసలాళ్లు అంతపొద్దు పోయిందాకా బజార్లో ఏం చేస్తారు?" అన్నది.

ముఖర్జీభార్య ముక్కెర అటూఇటూ ఊగులాడింది.

శైలేశ్వరుని భార్య సగం చచ్చి,అన్నది:—"కాని నే నెప్పుడూ చూడలేదు, వారు చాకలి శ్యామతో మాట్లాడటం! మాగుడ్డలు ఉతికేది చాకలి శీనాయి. శ్యామ మాయింటికి ఎప్పుడూ రాలేదు—"

"నీ తెలివితేటలిలా మున్నకాబట్టే నీమొగుడిలా పోయింది! వాళ్ళు చేసేవన్నీ నిన్నక్కూడ సాక్ష్యంపెట్టి చేస్తారేమిటి? శైలేశ్వరబాబు అసలే ప్లీడరు! ఆయన చిక్కుతాడా! వ్యవహారాల్లో! మగవాళ్లని స్వాధీనం చేసుకోటానికి ఒకటే మార్గముంది—కనుమరుగు కానివ్వక పోవటం. కంటికి కనపడకపోయెనా—" అన్నది ముఖర్జీ భార్య.

౪

శైలేశ్వరబాబు కొడుకులిద్దరు. మాధవుడూ, యాదవుడూ. మాధవుడు బి. యే. పాసయాడు. యాదవుడు ఇంటర్ చదువుతున్నాడు. వాళ్లు పూజ్యుడైన తండ్రిగారిమీదపడ్డ కళంకానికి ఆశ్చర్యపోయారు! వాళ్ల స్నేహితులుకూడా ఇది నిజమేనని నమ్మి కూర్చున్నారు. కాని వాళ్ళలోకూడా కొంతమంది కుర్రవాళ్లు పిల్ల తరఫున లేకపోలేదు—వాళ్లు నోటి సానుభూతి చూపించసాగారు.

ఇట్లు ముసలివాళ్ళలో తగువు చాలా బలిసిపోయింది! హాల్దారుగారిమీద రాయ్ మహాశయుడు ఎంత కక్షపట్టాడంటే, అతనిమీద గుమ్మడికాయల దొంగతనం ఆరోపించి కేసుపెట్టాడు. బాదుడీగారు మాణిక్ పోద్దార్ దగ్గర ఇంతవరకు ప్రోనోటు రాసి అప్పు తెచ్చుకున్నాడు. ఇప్పుడు గంగూలీగారు ప్రోత్సహించటంవల్ల పోద్దార్ బాదుడీని డబ్బు కక్కమని కూర్చున్నాడు. మల్లిక్ హోమియోపతీ వైద్యుడు. ఆయన

ఎదురు పార్టీవాళ్ళకి మందులివ్వనని చెప్పతూ తిరగటం ప్రారంభించాడు. అందుకని గోస్వామిగారు కలకత్తావెళ్ళి "హోమియోపతి చికిత్స" ఒక పుస్తకం కొనుక్కునివచ్చి, వైద్యం నేర్చుకోవటం ప్రారంభించాడు.

రైతేశ్వరుని రెండుమూడు ఉత్తరాలు వచ్చినై. అవి ఎట్లాపడినవో శత్రుపక్షంవాళ్ళ చేతుల్లో పడ్డవి. ఈ సంగతి తెలిసి అనుకూలుడు మండిపడి పోస్టుమాస్టరుమీద పదిపేజీలు రిపోర్టు రాసి పైకపంపించాడు.

పాపం పోస్టుమాస్టరు ఈ ఆపద తప్పించుకోటానికి ఇల్లిల్లూ తిరిగి, అందరి కాళ్ళూ పట్టుకోసాగాడు. ఆ ఊళ్ళోవున్న సెకండ్ గ్రేడ్ ప్లీడరు అశుబాబు బల్లగుద్ది— "Everything is fair in love and fight." ఆఖరిదాకా పోట్లాడి చూసిగాని వదల" నని చెప్పివేశాడు.

౩

సనాతనపురంలో మళ్ళీ ఆందోళనగా వుంది. అందరినోళ్ళూ ఏదో నానుతూ ఉన్నై. ఈమధ్య రెండు ఘటనలు ఘటిల్లినై ఆ ఊళ్ళో.

హఠాత్తుగా చాకలి శ్యామ ఎక్కడినించో తిరిగివచ్చింది. అది వాళ్ల మేనమామగారింటికి పోయిందట. ఇప్పుడు చాకలి పేరాయుతో దాని కేసూ తెగువలేదు. ఇద్దరూ గాడిదమీద గుడ్డలమూటలు వేసుకుని హాయిగా పాడుకుంటూ పోతున్నారు, ఏమీ జరగనట్టుగా!

ముసలిముత్తావాళ్ళు మొదట ఇది చూసి చాలా ఆశ్చర్యపడ్డారు. తర్వాత దిమ్మ తెలుసుకుని "ఊఁ, మనదగ్గరా ఈ కబుర్లు. పేరాయిగాడు ఏదో లంచంమేసి ఉంటాడు.* మాధవుడున్నాడుగా ఇక్కడనే!" అన్నారు.

రైతేశ్వరుడు మళ్లీ తిరిగిరాలేదు. ఎందుకంటే అతను చచ్చిపోయాడు. ప్రేమలో పడికాదు—నూతిలోపడి. ఆ ఊళ్ళో పాడుబడ్డ బావి ఒకటి ఉంది. దానిలోనించి అతని కుళ్లిన శవాన్ని బయటికి తీశారు.

ఇది బయటికి తెచ్చింది మల్లిక్‌గారు!



# విముక్తి

సుప్రసిద్ధ కథకుడైన అంబుజాక్ష భౌమికుడు చాలా చింతాగ్రస్తుడై ఉన్నాడు. అసలు ఈ రోజుల్లో లేఖకుడనే వాడల్లా కొంచెం చింతాగ్రస్తుడై ఉంటున్నాడు. మంచి రచనను అర్థంచేసుకునేవాడు లేడు; మంచి రచనకు మార్కెట్టులో గిరాకీ లేదు—పైగా మంచి లేఖకుని దెబ్బలు కొట్టటానికి ఒక గ్రూపు విమర్శకులు ఎప్పుడూ నడుముకట్టుకుని సిద్ధంగా వున్నారు. కాని భౌమిక మహాశయుని ప్రస్తుత చింత వీటికి సంబంధించింది కాదు. ఆయన మూడురోజుల క్రితం ఒక కథ రాయాలని మొదలుపెట్టాడు—ఆరంభం చాలా బాగా ఉందికూడా—(రాస్తూ రాస్తూనే ఆయన శరీరం చాలాసార్లు పులకరించింది.)—కాని ఈ చిత్రమైన కథ ఎలా పూర్తిచేయాలో, ఎంత ఆలోచించినా ఆయన బుర్రలోకి రావటంలేదు. వాస్తవంగా కథను పూర్తిచేయటం ఎప్పుడూ ఒక సమస్యే—ఈ సంగతి కథకులకు బాగా తెలుసు. చివరిదాకావచ్చి అంబుజాక్షుడు కలం అవతలపెట్టి కూర్చున్నాడు. ఉదయంనించి నాలుగు కప్పుల టీ డికాక్షనూ, ఒకప్యాకెట్ సిగరెట్లూ ఖర్చుచేశాడు—కాని కథమాత్రం పూర్తి అయేస్థితిలో లేదు.

భౌమిక మహాశయుడు కూర్చుని వున్నాడు—మూడో అంతస్తు గదిలో ఒంటరిగా. గదితలుపు తెరిచివుంది. ఆ తెరిచిన ద్వారంనించి కొంత్తగాలీ, భార్యగొంతూ, పిల్లల అల్లరీ, కాకుల అరుపులూ లోపల ప్రవేశిస్తున్నవి. గాలి అంత చెడుపుగా కనిపించలేదు—కాని మిగతా శబ్దాలుమాత్రం కథ ప్లాటును చెదరగొట్టి అతని బుర్రలోనించి వెళ్ళగొట్టుతున్నట్టుగా ఆయనకు తోచింది. ఆయన కనుబొమలు చిట్లించి తలుపు బిగించాడు. పెద్దచుట్ట ఒకటి వెలిగించి కాళ్ళు ఆడించటం మొదలుపెట్టాడు. ఈవిధంగా కొంతసేపు గడిచింది. కాళ్ళు నెప్పిపుట్టినై కాని కథకు అంతం దొరకలేదు. భౌమిక మహాశయుడు అప్పటికి అలసిపోయిన కాళ్ళను ఆడించకుండా, ఇక చెవిమీద పట్టించాడు.

ఆయన ఒక అగ్గిపుల్లతీసి జాగ్రత్తగా కుడిచెవిలోకి పోనిచ్చి, కుడికన్నూ కుడిచెక్కిలీ కొంచెం కుదించాడు. ఈ కథ ఇవాళ ఏవిధంగానైనా పూర్తిచేయవలసిందే. ఎందుకంటే ఇవాళే కథ ఇవ్వాల్సిన ఆఖరిరోజు. ఇవ్వాళ ఇవ్వకపోతే "చమత్కారిణి" అనే మాసపత్రికలో అది అచ్చు కావటం అసంభవం. ఈమాసంలో పడకపోతే వృథాగా పాతిక రూపాయలు పోనై—పైగా భార్యా, సంపాదకుడూ, ఇద్దరి దగ్గరా చులకనై పోతాడు.

సంపాదకుడికి ఈయన మాట యిచ్చాడు—ఇరవైఅయిదు రూపాయలు ఇచ్చినట్టయితే అద్భుతమైన పెద్దకథ ఒకటి రాసిఇస్తానని. పైగా అంతకుముందే భార్యతో వచ్చేనెలలో 25 రూపాయలుపెట్టి అద్దకంచీర కొనిపెడతానని వాగ్దానం చేశాడు. రెండోసంబంధం భార్యను ఎలాగైనా సంతోషపెట్టాలిగదా.

భార్యను సంతోషపెట్టడంకోసమే అసలు ఈయన "చమత్కారిణి" అనే పత్రికకు వ్రాయటానికి ఒప్పుకున్నది. అలాకానట్టయితే మూడో రకం చౌకబారు పత్రికకు కథరాయటానికి ఒప్పుకునేవాడా? అంబుజాక్ష ధార్మికుడు పూర్వాచారాలను సమర్థించే లేఖకుడు. ఆయన మొదటినించీ ప్రతి కథలో పుణ్యం జయించడం పాపం క్షయించడం చూపుతూవస్తున్నాడు. అసలు ఇలాంటి కథలు వ్రాయటంలో ఆయన బాగా చెయ్యితిరిగినవాడు. ఆయనరాసిన "హిందూ—వైజయంతి" ప్రతిపుటలోనూ ఉపదేశాలే. కథపేరుతో నీతులువ్రాయటంలో ఆయన మొనగాడు: ఆయన "వంగవిపాణ"మనే గ్రంథం ప్రతియువకుడూ, యువతీ—ఒక యువకుడూ యువతీ ఏమిటీ—ఆబాలవృద్ధ వనితలందరూ చదవదగింది.

ఇప్పుడు వృద్ధాప్యంలో అడుగుపెట్టబోతున్న ధార్మిక మహాశయుడు, కేవలం భార్యను రంజింపజేయటంకోసం సంపాదకుడుపెట్టిన షరతులు ఒప్పుకుని చిక్కులోపడ్డాడు. నీతిని సమర్థించేకథ అతనిదగ్గర ఒకటి చక్కటిది ఉంది. విలాసపురంలోవుండే ధర్మాత్ముడైన జమీందారు

ఒకడు ఒక స్త్రీ సతీత్వాన్ని రక్షించటంకోసం తన సర్వస్వమూ ఏవిధంగా అర్పించిందీ—ఏవిధంగా దుర్మార్గుడైన మాధవ లాలు పిడుగు పడి తనపాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకున్నదీ, అంతా పోగొట్టుకున్న జమీందారు తన పుణ్యఫలం వల్ల ఒక సన్యాసి ఆశీర్వాదంతో ఏవిధంగా మళ్ళీ తన ఆస్తి అంతా సంపాదించగలిగిందీ—ఈ వివరాలు ఆయన చక్కటి గ్రాంధికంలో "పతివ్రత-ఆశీర్వాదం" అనేకథలో రాశాడు. కాని "చమత్కారిణి" సంపాదకుడు "మైనెస్ త్రీ" కళ్ళద్దాలు పెట్టుకుని బహుశా కాంటినెంటల్ భావరాజ్యంలో తిరుగుతూ వుంటాడు కామాలు—ఆయనకు ఈ కథ నచ్చలేదు. పైగా తనకు ఎలాంటి కథ కావలసిందీ నూచనగా చెప్పాడుచూడా. తరుణీభార్య అలుక మొహాన్ని తలుచుకుని "ఎట్లారాసివుంటే అలా జరుగుతుం" దని భౌమిక మహాశయుడు కథరాయటానికి మొన్నటినించీ పూనుకున్నాడు. పూనుకున్నంతమాత్రంచేత లాభమేమీ లేకపోయింది. ఆఖరికి చెవిలో అగ్గిపుల్ల దూర్చుకున్నా లాభంలేకపోయింది.

"ఊఁ" అని మూలిగి భౌమిక మహాశయుడు చెవిలోనించి అగ్గిపుల్ల బయటికితీశాడు. ఎదురుగావున్న కిటికీలోంచి చూస్తే కోతి ఒకటి ఎదురు ఇంటి పిట్టగోడమీద కూర్చుని పళ్ళు ఇకిలిస్తూవుంది. ఒక ముసలమ్మ దాన్నిచూసి ఆరబెట్టిన వడియాలు ఎత్తుకుపోతూవుంది. భౌమిక మహాశయుడు తను ప్లాటువేసిన కథకు ఈ చౌకబారు దృశ్యాలు ఎందుకూ పనికిరావని అనుకుని చూపు ఇంకోవైపు మరల్చాడు. ఇంకోవైపుకు అంటే గదిగోడవైపుకు అని అర్థం. భౌమిక మహాశయుని అద్దెగదిగోడలకు వీరి "ప్రేమకోసం" అనే కథను పూర్తిచేయటానికి తగిన సామగ్రిలేదు. గత్యంతరం కానక భౌమికమహాశయుడు కళ్లు మూసుకుని చుట్ట ఒక పీల్పు పీల్చాడు. పీల్పుపీల్చగానే కళ్ళు తెరవాలని అతనికి తెలిసింది—కారణం చుట్ట ఆరిపోయింది. అగ్గిపుల్ల తీసి వెలిగించాలి. చాలాజాగ్రత్తగా చుట్ట వెలిగించాడు—వెలిగించి ఈ పరిస్థితిలో ఏమి చెయ్యాలా అని ఆలోచించ మొదలు పెట్టాడు...నాయకుడు

నాయిక ఇంటిగోడ దూకాడు. అర్ధరాత్రి—అందులో అమావాస్య. వాన ఒక్కొక్క చినుకే పడుతున్నది. నాయకుడు వొంగుని పిల్లిలాగా పొన్నచెట్టుక్రిందికి రావాలని చూస్తున్నాడు. కాని అక్కడే ఆవుకట్టి వేసి ఉండటంచేత దానిదగ్గరకు చేరటానికి ధైర్యం లేకపోయింది.

భామిక మహాశయుడు ఇంతవరకు అవలీలగా రాసివేశాడు. దాని తర్వాత ఏమిరాస్తే, ఆర్టు చెడకుండా ఉంటుందో: నాయకుడింకా ఏ మహా ఘనకార్యాలు చేస్తే సంపాదకుడు మెచ్చుకుని అచ్చువేస్తాడో అతనికి తోచకుండావుంది. అసలతని బుర్రలోకి ఏమీరావటంలేదు. ఈయన మొదటినించీ పుణ్యంజయించటమూ పాపంక్షయించటమూ చూపుతూ వచ్చాడు—ఇప్పుడీ అవినీతికరమైన వ్యక్తిని కథానాయకుడుగా పెట్టుకుని అతనిచేత ఏ పని చేయించాలో అతనికి తోచటంలేదు. కాని అతనుమాత్రం వ్యక్తిగతంగా "వాడివీపు బెత్తంతో పగలగొట్టించాల"ని అనుకున్నాడు: ఇలా అయితే ఆర్టు చెడకుండా ఉంటుంది. కాని ఆర్టు చెడకుండావుంటే మరి పాతికరూపాయలో:

అరి భగవంతుడా: ఏమి సమస్య ఇది!—ఇక ఆయనకు దిక్కుతోచక భగవంతుణ్ణి ప్రార్థించటం మొదలు పెట్టాడు — "భగవంతుడా! ఈ ఉభయసంకటంనించి నన్ను రక్షించు! పాపచరిత్ర నేను రచించలేను—సరికదా, ఇటు భార్యకోపాన్నికూడా భరించలేను. దయామయా! నామీద దయచూపు!"

భగవంతుడు బహుశా ఇదంతా స్వయంగా వినివుంటాడు. రెండు నిమిషాల్లో అంతా సరిఅయిపోయింది.

భూకంపం వచ్చిన తర్వాత భామిక మహాశయుడు సూక్ష్మశరీరంతో, తన భార్యకిక అద్దకం చీరతో అవసరంలేదని కనుక్కొగలిగాడు.

కారణం, ఆయనభార్య విధవ అయింది!



# స్త్రీ హృదయము

అర్ధరాత్రి :

దోమతెరలో పండుకుని శ్రీమతి సునంద మాసపత్రిక చదవటంలో మగ్నమైంది. అప్రక్కనే శ్రీయుత తమాలకాంతుడు దిండు కౌగిలించుకుని గుర్రుపెడుతున్నాడు. చెప్పటం అనవసరం, అయినా వీళ్లు భార్యాభర్తలు. ఒక సంవత్సరం అయింది వివాహం అయి. ఇంకా సంతానం లేదు.

సునంద ప్రతిరోజూ ఇంతే-అంటే పండుకోబోయే ముందు కొంచెంగాని పుస్తకమో పత్రికో తీసుకుని తలదగ్గర దీపం పెట్టుకుని నిద్రమత్తుతో ఉన్న కళ్లతో చదువుతూ ఉంటుంది. తమాలకాంతుడు సోగా ఇష్టే విధంగా, నిశ్చింతగా నిద్రపోతాడు.

మాసపత్రిక పేజీలు తిరగవేస్తూ ఉండగా, 'కథ కాదు!' అనే కథ ఒకటి హఠాత్తుగా కనిపించింది. పేరు చాలా చిత్రంగా ఉంది. కథకుని పేరు లేదు. సునంద చదవనారంభించింది. చదువుతూ ఉండగానే సునంద మనస్సు నిర్మల అనే పిల్లకోసం వ్యాకులపడటం మొదలు పెట్టింది. విశ్వనాథుడనే కుర్రవాడిమీద సునందకు మొదట కోపం వచ్చింది. కాని అది ఎక్కువసేపు నిలవలేదు. విశ్వనాథుడు సెలవు తీసుకుంటూ నిర్మల రెండుచేతులూ పట్టుకుని భోరున ఏడ్చేవరకు సునంద కోపంకూడా నీరయింది. విశ్వనాథుడికి నిర్మల దక్కలేదు. కాదంబిని నెత్తిన పడింది.

కథ క్లుప్తంగా అది:

విశ్వనాథుడనే పేరుగల యువకుడు ఎండాకాలపు సెలవల్లో మేనమామగారింటికి వస్తాడు. అక్కడ చేసేపని ఏమీ లేకపోవటం మూలాన చెరువు వొడ్డుకుపోయి తిష్ఠవేస్తాడు. ఉద్దేశం చేపలు పట్టాలని. ఒకగ్గో జల్లా బెండువంక చూసి చూసి కళ్ళు చీకట్లు కమ్ముతూ ఉండేస్థితిలో ఒక ఘటన జరిగింది. బెండు మునగటమూ విశ్వనాథుడు విసురుగా లాగడమూ, "అమ్మో-బాబో!" అనే కేకా ఒక్కమాటు జరిగినై.

విశ్వనాథుడు చకితుడై వెనక్కి చూశాడు–గాలం ఒక్కపిల్ల చేపను తగులుకుంది. ఆ పిల్లే నిర్మల అని చెప్పటంకూడా అనవసరం.

ఇదే ప్రారంభం.

ఆ తర్వాత అశ్లీలత లేకుండా ఎన్నివిధాల ప్రేమాలాపాలు జరగ వచ్చో అవన్నీ జరిగినై, ఇంకా జరిగేవికూడా విశ్వనాథుడి మేనమామ నగక రంగస్థలంమీదికి రాకపోతే. మామగారు ఈ వాగుడు అంతా యౌవ్వన చాంచల్యమని ఒక్క నవ్వుతో తోసి పారవేశాడు. పైగా కొంచెంబినిని ఇతనిమీద ప్రయోగించాడు.

విశ్వనాథుడు మొదట చాలా ఎదురు తిరిగాడు. కాని పాపం, అతను ఒక్కడే ఏమిచేయగలడు? మహా అయితే అతను వాళ్ళమామను ఎదిరించగలడు? కాని సమాజాన్నంతనూ తిరస్కరించడం అతనికి సాధ్యమా? విశ్వనాథుడు బ్రాహ్మడు–నిర్మల కాయస్థకన్య. అంచేత అతను నిర్మల రెండుచేతులూ పట్టుకుని ఏడవటం తప్ప ఇంకేమీ చేయ లేకపోయాడు.

కథ ఫకడ్‌గా ఉంది. నిర్మలకోసం సునంద చాలా బాధపడసాగింది. దీపం ఆర్పి సునంద పండుకున్నప్పుడు నిర్మలకోసం ఆమె కంట్లో ఒక నీటిబొట్టు కనపడింది. హృదయంలేని సమాజం.

ఆ మర్నాటి సాయంత్రం తమాలకాంతుడు ఆఫీసునించి తిరిగి వచ్చే వరకు వ్యవహారమంతా పెడతిరిగి ఉంది. పాపం, ఇతను 'డెయిలీ పాసెంజరు.' ఉదయం లేవగానే స్నానం భోజనంచేసి 8-47 గంటల 'లోకల్'లో ఆఫీసుకు వెళ్తాడు; సాయంత్రం 7-42 'లోకల్'లో తిరిగి వస్తాడు.

సునందలో ఇలాంటిమార్పు అతను ఎప్పుడూ చూడలేదు. మొహం కుంపటిలాగా పెట్టుకుని సునంద కూచునిఉంది. భర్తరాగానే ఆమె లేచి నుంచుంది. మాటామంతీ లేకుండానే అంగవస్త్రమూ, రుమాలూ అందించి టీ తయారు చేయటానికి వంటఇంట్లోకి పోయింది.

ఒక్కమాటకూడా మాట్లాడలేదు, నోటితో. బూట్లు విప్పదీస్తూ తమాలకాంతుడు 'సంగతి ఏమిటా?' అని ఆలోచనలో పడ్డాడు.

అయిదారు నిమిషాలు గడిచినాక సునంద వేడి టీ ఒకకప్పు చేత పట్టుకుని వచ్చింది—ముఖం అప్పుడుకూడా అట్లాగే ఉంది.

తమాలకాంతుడు టీ ఒక్కగుటక వేసి-"ఇదిగో! నిన్న రైల్లో 'పుష్ప రసవిలాసం' అని తలనూనె ఒకడు అమ్ముతున్నాడు. వాడు రోజూ అమ్మేవాడేలే! ఒక్కసీసా నీకు తీసుకువద్దామనుకున్నాను. వాసనకూడా బాగా ఉంది. మన మల్లిక్‌గారు తలకు చల్లగాకూడా ఉంటుందని చెప్పారు!" అన్నాడు.

సునంద మాట్లాడకుండా బయటికి వెళ్లింది.

తమాలకాంతుడు లక్షణాలేవీ బాగాలేవని గ్రహించాడు. హఠాత్తుగా ఏమిటీ మార్పు!

టీ పూర్తిచేసి తమాలకాంతుడుకూడా బయటికి వెళ్ళాడు-సునంద పూలుమఫ్లర్ ముందేసుకుని కుట్టుతూ ఉన్నది. తమాలకాంతుడు నవ్వుతూ-"ఏమిటి, నువ్వు, ఇవ్వాళ ఇంత గంభీరంగా ఉన్నావు? ఎందుకు మొహం అలా పెట్టావు? సంగతేమిటి?" అన్నాడు.

సునంద ఇక కంట్రోలు చేసుకోలేకపోయింది. బాంబులాగా పేలింది:-

"నాదగ్గర చాతుర్యం చూపించబోతా వెందుకూ? నిర్మలదగ్గరకే పోరాదూ! ఆపిల్ల రెండుచేతులూ పట్టుకుని భోరున ఏడ్చి నామనసంతా నీదేనంటివే! నీశరీరమూ పెళ్ళిచేసుకున్నది! సమాజమనే యూపకాష్ఠానికి నిన్ను బలిపెట్టుకున్నావాళ్ళ?"

"ఎవరు నిర్మల! నీకేమన్నా పిచ్చి ఎక్కిందా ఏమిటి!" అన్నాడు తమాలకాంతుడు విస్తుపోయి.

సునంద ఏమీమాట్లాడకండా 'గల్ప ప్రభాకర్' అనే మాసపత్రికా, దాని సంపాదకుడు రాసిన జాబూ స్టప్లైచేసున్న తమాలకాంతుని చేతి కిచ్చింది. సంపాదకు డిలా రాశాడు:-

వందనాలు,

తమ 'కథకాదు' అనే కథ మా మాసపత్రికలో ప్రచురించాము. ఆ సంచిక వేగాగా తమకు పోస్టు చేయాల్సివుంది. కథ ప్రచురించటంలో

ఆలస్యం జరిగినందుకు తమరు వేరుగా భావించకండి. తమకథ ఇంకొకటి కావాలి. భవదీయ,

నృసింహప్రసాద్ తాలూక్‌దార్.

రెండు సంవత్సరాలక్రితం తన ఈ కథ 'కల్ప ప్రభాకర్'కు పంపినట్లు అతనికి మెరుపులాగా తోచింది. ఆ తర్వాత అతను పెళ్ళి చేసుకున్నాడు; నౌకరి సంపాయించాడు. సాహిత్యసేవకూడా చాలాకాలం క్రిందటే వదలిపెట్టాడు. ఈకథ సంగతికూడా అతను ఎప్పుడో మరచిపోయాడు! ఇవ్వాళ హఠాత్తుగా ఈ ఉపద్రవ మేమిటి! సందిగ్ధావస్థలోపడి, నచ్చుకొట్టుతూ "ఎప్పుడో ఒక కథ రాశానే అనుకో-ఇప్పుడే మొచ్చింది దానికి?" అన్నాడు.

"కథా? నువ్వే రాస్తివిగా 'కథకా' దని!"

తమాలకాంతుడు కొంచెం నవ్వాలని ప్రయత్నిస్తూ-"అదా-అదా-ఒకస్టయిల్-తెలియులా-"

సునంద కేమీ తెలియలేదు-అసలు తెలుసుకో దలుచుకోనూ లేదు. నిర్మల అడ్రసు గనక చిక్కితే ఒక్కమాటుపోయి చూసి రావాలనుకుంది-ఏమంత చక్కనిదో ఆమె అని. భర్తరాసినంత చక్కనిదేనా అని ఆమె సందేహం!

ఈర్ష్యతో ఆమె హృదయమంతా దహించుకుపో మొదలుపెట్టింది. కాని, కొన్నిగంటలకు పూర్వం ఆమె ఈహృదయమే నిర్మలకోసం ఎంతో బాధ పడింది!



# ఈకాలపు పిల్లలు

[పోలీసు సూపరింటెండెంటు ఆఫీసుగది. గదిలో పెద్ద టేబిలూ, ఫైల్సూ కొన్నికుర్చీలూ, రికార్డుబీరువాలూ ఉన్నాయి. పోలీసు సూపరింటెండెంటు మిస్టర్ సేన్ చాలా ఉత్తేజితస్థితిలో పచారుచేస్తున్నాడు. మిస్టర్ సేన్‌కు యాభైఏళ్ళు ఉన్నా మంచి బలిష్టంగా ఉన్నాడు. బుల్ డాగ్ మొహం, చూట్టానికి భయంకరంగా ఉంటుంది. ఖాకీహాఫ్ షర్టూ, హాఫ్ ప్యాంటూ, నడుముకు తోలుబెల్టు, నోట్లో పైపు; వాకిట్లో చప్పుడువిని తిరిగిచూస్తాడు. కాన్‌స్టేబిలువచ్చి సెల్యూట్ చేసి కార్డు ఇస్తాడు. మిస్టర్ సేన్ కనుబొమ్మలు చిట్లించుకుని కార్డు చూస్తాడు.]

సేన్:—(కార్డు టేబిలు మీద వేసి) సాబ్‌కో ఆనేబోలో.

[కాన్‌స్టేబిలు సలాంచేసి వెళ్ళిపోతాడు. ఒక నిమిషానికి మామూలు ధోవతీషర్టూ వేసుకున్న నివారణబాబు ప్రవేశిస్తాడు. నివారణబాబు మిస్టర్ సేన్‌కు బాల్యస్నేహితుడు. ప్రస్తుతం ఇక్కడే కాలేజిలో ప్రొఫెసరుగా ఉన్నాడు.]

నివా:—ఏమోయ్ సేన్! నేను విన్నకబురు నిజమేనా?

సేన్:—(కాసేపు మౌనంగాఉండి)నిజమే! (సేను కళ్లు రెండూ ఎర్రబడతై. ఏదో చెప్పాలనుకుంటాడు కాని మళ్ళీ ఆగుతాడు. నివారణబాబు కుర్చీలో కూర్చుంటాడు.)

నివా:—నిజం? విమల పారిపోయినట్టేనా?

సేన్:—(బిగ్గరగా) ఆc! ఆc, నాకూతురు పారిపో లేదోయి, లేచిపోయింది. నువ్వునన్ను ఎగతాళి చేయటానికేనా వచ్చింది, ఆ సంగతి తెలిసి! ఇఫ్ సో-(ఉద్రేకం కొంచెం తగ్గించుకుని పైపు పళ్ళతో బిగిస్తాడు.)

నివా:—(శాంతంగా) ఛా,ఛా! నాకు సమయాసమయాలు తెలియవనుకున్నావా? మిత్రుడు ఆపదలో ఉన్నాడు, మనంవచ్చి చూసిపోవటం ధర్మమనివచ్చాను. నీకు కష్టంగాఉంటే వెళ్లిపోతాను-(లేవబోతాడు)

సేన్:—(హఠాత్తుగాతిరిగి) please take your seat and don't be silly! (నివారణబాబు కూర్చుంటాడు. సేన్ మళ్ళీ పచారుచేయటం మొదలు పెడతాడు.)

నివా:—ఆచూకీ ఏమీ చిక్కలేదా?

సేన్:—ఊహుఁ. కాని—(హఠాత్తుగా ప్రసంగం మార్చి) సరే, మా అమ్మాయి నీదగ్గర చదువుతున్నదికదా, దాని విషయంలో నీఅభిప్రాయ మేమిటి?

నివా:—చాలా మంచిదనే నాఅభిప్రాయం! ఈమధ్య కొత్తగా వచ్చిన మాకుర్ర ఫిలాసఫీ ప్రొఫెసరుకూడా మీఅమ్మాయిని చాలా పొగుడుతాడు. నువ్వెరుగుదువా ధీరేన్‌బాబుని? విమల చాలా మంచిదంటాడు అతను.

సేన్:—మంచిదంటే ఏవిషయంలో?

నివా:—చదువులో, మేనర్సులో—

సేన్:—మరి క్యారక్టరు?

నివా:—నా ఉద్దేశం మంచిదనే—

సేన్:—అలాగైతే how do you explain this? నువ్వక్కడ ఉన్నావు, కేర్ తీసుకుంటావు గదా అని పంపినందు కిదా ఫలితం?

నివా:—(నవ్వి) విద్యార్థినుల నడతమీద బాధ్యతవహించడం మా కలివిగాని పని. అసంభవంకూడా.

సేన్:—ఎందుకని?

నివా:—నోట్సు చెప్పి పరీక్షలైతే ప్యాసుచేయించగలం. కాని నడత నేర్పితే వచ్చేదికాదు. చిన్నప్పటినించీ చుట్టుపక్కలఉండే స్నేహితులను బట్టి అది ఏర్పడుతుంది. పూర్వం గురుకులాలు ఉండేటప్పుడు విద్యార్థులూ గురువులూ కలిసి ఉండేందుకు వీలుండేది. ఇప్పుడు ఒకే గురువుదగ్గర చదవటానికి వీల్లేదు. అదీకాక-(టక్కున ఆగి నవ్వుతాడు.)

సేన్:—అదీకాక?

నివా:—హెరిడిటీ అనేది ఒకటి ఏడ్చిందిగా! లక్షతంటాలు పడ్డా మనం వేపవిత్తునించి మామిడిమొక్క మొలిపించలేము!

సేన్:—ఐతే నువ్వింతకూ చెప్పేదేమిటి?

నివా:—You should remember the wild oats you have sown! నామాదిరిగా నువ్వుకూడా భార్యపోగానే మళ్ళీ పెళ్ళిచేసుకుంటే బాగుండేది.

సేన్:—నాన్ సెన్సు! నువ్విక్కడ నాకు వేదాంతం చెప్పటాని

కొచ్చావేమిటి? ఇఫ్‌సో—(ఉద్రేకం తగ్గించుకుని పైపు నోట్లో పెట్టు కుంటాడు.)

నివా:—చూడు, బ్రదర్! నువ్విష్టపడే విమలని కాలేజికి ఉన్నతవిద్య కోసం పంపించావు ఇప్పుడిక ఆనుర్దాపడి మాత్రం లాభ మేమిటి?

సేన్:—అంటే?

నివా:—అంటే విమల స్వాతంత్ర్యాన్ని నువ్వంగీకరించాలి.

సేన్:—స్వాతంత్ర్యమంటే విచ్చలవిడిగా తిరగటమా?

నివా:—కాదు! కాని, నువ్వింకొకటి అంగీకరించాలి-చదువు చెప్పించటమంటే శృంఖలాల్ని తెగగొట్టే ఉపాయం సేర్పటమన్నమాట. పంజరంలో ఉండేపక్షికి ఆకాశాన్నిగురించి చెప్పితే పంజరంమీద దాని కేమాత్రం మోహముండదు. ఇప్పుడు నువ్వికచేసేది ఏమీలేదు, విమల స్వతంత్రబుద్ధిని నమ్మి ఊరుకోటంతప్ప. నామాటవిని నువ్వు విమలని గురించి ఏమీ అధైర్యపడమాకు!

సేన్:-కూతురుకనబడకుండాపోతే అధైర్యపడకమాకమనా నీసలహా! అదీకాక పెళ్ళికూడా నిశ్చయమైంది. జమీందారుగారి అబ్బాయి మొన్న వచ్చి పిల్లనిచూచి ఇష్టపడికూడా పోయాడు. అదివరకు నాలుగైదు సంబంధాలు కాదన్నాడట.

నివా:—ఛా, ఛా! ఏంపని నువ్వుచేసింది? బి. ఏ. చదువుతున్న పిల్లని పశువుమాదిరిగా ప్రదర్శిస్తే రివోల్టుకాకుండా ఉంటుందా!

సేన్:—చూడకండా పెళ్ళెలా చేసుకుంటారు? ఎంతోమంది డబ్బు మాటలతోకూడా వాళ్ళ ఇళ్ళకుపోయి—

నివా:-అలాగైతే నువ్వుకూడా విమలకి చదువుచెప్పించకుండా చిన్న ప్పుడే ముడిపెట్టేస్తే సరిపోయేది. రెండు పడవల్లో కాళ్లు పెట్టినవాడు నది ఎప్పుడూ దాటలేడు—ఎక్కడో ఒకచోట మునుగుతాడు.

సేన్:—చూడు నివారణ్! ఇది నీ లెక్చరుహాలు కాదు. నాకు నీ ఉపన్యాసం వినే తీరికకూడా లేదు.

నివా:—నేనిక్కడికి ఉపన్యాసం ఇవ్వటానికికూడా రాలేదు. వేరేపని ఉండే వచ్చాను. నువ్వు కొంతమంది కుర్రవాళ్ళని అరెస్టు చేశావటగా?

సేన్:—అఁ. క్రిమినల్సుని అరెస్టు చెయ్యటానికే గవర్నమెంటు నాకు జీతమిస్తున్నది.

నివా:—(ఆశ్చర్యంతో) వాళ్ళంతా క్రిమినల్సా?

సేన్:—నే నలా నే అనుమాన పడ్డాను?

నివా:—అనుమాన పడటానికి ఆధారం?

(మిస్టర్ సేన్ టేబిల్ దగ్గరకుపోయి డ్రాయర్ తెరిచి కొన్ని ఉత్తరాలు నివారణబాబు చేతి కిస్తాడు.)

సేన్:—నే నెరిగిన చోట్లకెల్లా రిప్లయి ప్రీపెయిడ్ టెలిగ్రాములిచ్చి అక్కడకు రాలేదని తెలుసుకున్నాక, I broke open her boxes and found these love letters! వెధవల్ని అందర్నీ అప్పుడే అరెస్టు చేశాను.

నివా:—(ఆశ్చర్యంతో ఉత్తరాలన్నీ తిప్పితిప్పి చూసి టేబిలుమీద పెట్టి) సరే, లవ్-లెటర్సు రాశార నే అనుకుందాము. కాని లవ్-లెటర్సు రాయటం క్రైమ్ కాదే, అలాగైతే అందరికంటే పెద్ద క్రిమినల్ వినువ్వే?

సేన్:-ఇదుగో నివారణ్! I am not in a mood for jokes now.

నివా:—కొద్దిమంది కుర్రవాళ్లు నీ కూతురికి లవ్ లెటర్సు రాశార నే అనుకో—నీ కెందుకోయ్! అంత ఉద్రేకం? నేనింకా నువ్వు సరసుడవ నే అనుకుంటున్నాను!

సేన్:—సరసానికికూడా వేళాపాళా ఉంది! విమల నీకూతురు కాక పోయ్యె, నీ సరసత్వమేమిటో బయటపడేది.

నివా:—(మందహాసంతో ఒకక్షణం సేన్ ముఖంవంక చూసి) సరే, నువ్విప్పు డరెస్టుచేసిన కుర్రవాళ్ళని ఏం చెయ్య దలచుకొన్నావు?

సేన్:—ఎంక్వయిరీ.

నివా:—ఎక్కడున్నారు వాళ్లు?

సేన్:—రాత్రంతా లాక్అప్‌లో ఉన్నారు. ఇప్పుడే పక్కగదిలోకి పిలిపించాను. Good for nothing beggars all of them!

నివా:—కేవలం అనుమానం మీద ఇంతమంది గౌరవ కుటుంబాలకు చెందిన కుర్రవాళ్ళను—

సేన్:—You shut up! గౌరవకుటుంబాలకి చెందిన కుర్రవాళ్ళు పైగా! గౌరవకుటుంబాలకి చెందిన కుర్రవాళ్ళయితే గౌరవ కుటుంబానికి చెందిన పిల్లకు ఇలా ఉత్తరాలు రాస్తారా?

నివా:—ఏం? అందులో నాకేమీ తప్పు కనపడలేదు—ఒకటి రెండు స్పెల్లింగ్ మిస్టేక్సు తప్ప. అందరు రసవంతమైన భాషలో నీకుమాత్రె గుణగణాలు ప్రశంసించారు. దీనికి నీకు కోపమెందుకోయ్?

సేన్:—చూడు నివారణ్! There is a limit to everything.

నివా:—Ought to be!

సేన్:—(నవ్వును ముంచుకువచ్చి) మరి నీ ఉద్దేశమేమిటి? ఎందుకొచ్చావు?

నివా:—కుర్రవాళ్ల గార్డియనులు వచ్చి నన్ను పట్టుకున్నారు.

సేన్:—ఓ–ఐతే సిఫార్సు చేయటానికి వచ్చావన్నమాట. మరి అలా చెప్పావేం, మిత్రుడు ఆపదలో ఉంటే చూట్టాని కొచ్చావని! (ఆవేశంతో) You teachers and professors, you are a hopeless lot of hypocrites!

నివా:—(చలించకండా) ఒక్క విషయంలో మాత్రం నిన్ను ప్రశంసించాలోయ్! ఇంతకాలం పోలీసు ఉద్యోగం చేసికూడా అశ్లీలభాష ఉపయోగించలేదు.

సేన్:—ఇదిగో నివారణ్!–

నివా!—(ప్రార్థనగా) వాళ్ళని వొదిలిపెట్టు బ్రదర్!

సేన్:—ఊహూఁ.

నివా: చూడు——

సేన్:—(విసుగుతో బిగ్గరగా) వదలను! వాళ్ళ నెంతమాత్రం వదలను. This is abduction!

నివా:—నేను చెప్పతున్నాగా వాళ్ళు నిర్దోషులని! నామాటవిను–

సేన్:—నే నేమీ వినదలుచుకోలేదు! ను వొచ్చిన పని-సానుభూతి చూపటం అయిపోతే-You may go and let me do my duty. (కొంచెం ఆగి) వీళ్లు నిర్దోషులా! నీ కెలా తెలుసు?

నివా:—నా నమ్మకం అది.

సేన్:—నీ నమ్మకం! మరి నా నమ్మకం ఏమిటో ఎరుగుదువా!

నివా:—ఏమిటి?

సేన్:—పది గాడిదలు కలిస్తేగాని ఒక పంతులు కాడని

నివా:—అంటే.

సేన్:—అంటేలేదు, గింటేలేదు. Please go, I want to see through the game.

నివా:—నామాట కొంచెం ఆలోచించు. ఊనులో ఇంతమంది పెద్ద మనుషులకు కోపం తెప్పించడం మంచిదికాదు! ఈ రోజుల్లో అసలే—

సేన్:—ఏం, నువ్వు నన్ను భయపెట్ట దలుచుకున్నా వేమిటి?

నివా:—ఉహుం. నాలుగు దిక్కులా పరికించి మరి, చేసేపనిచెయ్య మంటున్నాను.

సేన్:—నేనేమీ పరికించ దలచుకోలేదు—Please go (నివారణ బాబు ఏమీ మాట్లాడలేదు. సేన్ కోపంతో అతనివంక చూస్తూ కాసేపు పచారుచేసి) ఇంకెందుకూ కూర్చున్నావు!

నివా:—బయటికి గెంటిస్తా వేమిటి?

సేన్:—ఇంకెవరన్నా అయితే అపనే చేసేవాణ్ణి. [గడియారం చూసి] పది అయింది, మీ కాలేజీ లేదా ఇవాళ?

నివా:—ఉహుం. ఐతే నువ్వు వీళ్ళని వదలవన్న మాటేగా?

సేన్:—ఆఁ.

నివా:—నీ వ్యవహారం నాకేమీ బాగాలేదు. సరే—నేను పోతు న్నాను, ఇంకోమాటు ఆలోచించి చూడు.

(సేన్ పైపు నోట్లో పెట్టాడు, జవాబేమీ ఇవ్వలేదు. నివారణ బాబు వెళ్లిపోగానే బెల్ నొక్కుతాడు. కానిస్టేబిల్ వస్తాడు.)

సేన్:—(ఒక ఉత్తరంతీసి రాసినవాడి పేరుచూసి) భూషణ్ బాబుని పిలుచుకురా. (కాసేపటికి సన్నగా రోగిష్టిగా ఉన్న కుర్రవాడు భయ పడుతూ లోపల ప్రవేశించి నమస్కరిస్తాడు. సేన్ ఆ కుర్రవాణ్ణి ఒకటి రెండుసార్లు ఆ పాదమస్తకం పరీక్షిస్తాడు.) నీ పూర్తి పేరేమిటి?

భూషణ్:—జ్యోత్స్న భూషణ చౌధురీ!

సేన్:—నువ్వు మా అమ్మాయి విమలని ఎరుగుదువా?

భూషణ్:—ఆఁ.

సేన్:—మీ ఇద్దరికీ పరిచయం ఎలా అయిందీ?

భూష:—మా ఇద్దరిదీ ఒక క్లాసే నండి.

సేన్:—నువ్వేమన్నా లవ్ లెటర్సు రాసేవాడివా విమలకి?

భూష:—(గుటక వేసి) లేదండీ !

సేన్:—(ఒక ఉత్తరంతీసి) ఐతే ఇది రాసింది ఎవరూ ? (చదువు తాడు.)

'విశాలహృది విమలాదేవి! ఇవాళ థర్డ్ పిరియడ్‌లో నువ్వు ముఖం తిప్పుకు కూర్చున్నా వెందుకని ? దగ్గిదగ్గి నా గొంతు పోయింది. కాని నువ్వు ఒక్కమాటు కూడా తిరిగి చూడలేదు.—' ఎవరిది రాసింది ?

భూష:—(వెలారిన గొంతుతో) చిత్తం! నా కర్థం కావటంలేదు-ఈ ఉత్తరం ఎలా...

సేన్:—(గద్దిస్తూ) అర్థం కావటంలా, స్కౌండ్రల్ ! కొరడాతో పిపు చిట్లుతుంది, తెలుసునా ?

భూష:—(వణుకుతూ) ఈమాటు క్షమించండి, ఇక నెప్పుడూ చెయ్యను ఇలాంటిపని.

సేన్:—విమల ఎక్కడుందో ఎరుగుదువా ?

భూష:—(కళ్లు మూసుకుని) చిత్తం, తెలియదండి.

సేన్: — (మళ్ళీ గద్దిస్తూ) నిజంచెప్పు! నీకు తెలియదా ?

భూష:—అమ్మతోడండీ!-నాకేం తెలియదు ?

సేన్:—అబద్ధం చెప్పి నా దగ్గరనించి తప్పించుకోలేవు !

భూష:—నిజమే చెప్పుతున్నాను సార్ ! నాకు తెలియదు.

సేన్:-సరే, పోయి అగదిలో కూర్చో. నువ్వు నిజంచెప్పావో, అబద్ధం చెప్పావో ఇప్పుడే తేలుతుంది (భూషణ్ పక్కగదిలోకి పోతాడు. సేన్ గంటనొక్కితే కాన్‌స్టేబిల్ వస్తాడు).

సేన్:—(ఇంకో ఉత్తరంతీసి) విహంగమ బాబుని పిల్చుకురా.

(పక్కపాపటి క్రాపు, కోటూ, కాళ్ళకు సాండల్సుతో విహంగమ బాబువస్తాడు. కుర్రాడు చూట్టానికి హుషారుగా ఉంటాడు.)

విహం:—Good morning, sir !

సేన్:—(కను బొమలు చిట్లించి ఒక్కక్షణం అతని వంకచూసి) నీా కులం?

విహం: —కాయస్థులమండి, మిత్ర మా వంశ నామం.

సేన్:—ఏ యియర్ నువ్వు?

విహం:—థర్డ్ యియరండి.

సేన్:—అప్షనల్సు ?

విహాం:—హిస్టరీ, ఫిలాసఫీ, ఆనర్సులో హిస్టరీ తీసుకున్నాను.

సేన్:—మా అమ్మాయిని ఎరుగుదువా?

విహాం:—నాతో చదివేపిల్లలనందర్నీ ఎరుగుదును. మీ అమ్మాయి పేరు?

సేన్:—విమల.

విహాం:—(పులకితుడై) ఓ బాగా ఎరుగుదును! పచ్చగా, బొద్దుగా ఉంటే అమ్మాయి కదూ?

సేన్:—(కోపంగాచూస్తూ) నీవొళ్లుచెడకుండా ఉండాలంటే అడిగిన ప్రశ్నలకే జవాబులివ్వు.

విహాం:—(ఆశ్చర్యంతో) తప్పుమాట నానోటినుంచి ఏమి వచ్చిందండీ!

సేన్:—మా అమ్మాయికి నువ్వు ఉత్తరాలు రాసేవాడివా?

విహాం:—మాక్లాసు కాబట్టి రాస్తే ఒకటి రెండుసార్లు రాసి ఉంటానేమో! నాకు బాగా గుర్తులేదు.

సేన్:—(రాసినవుత్తరం చూపిస్తూ) ఇది నువ్వు రాసిందేనా?

విహాం:—(ముందుకొచ్చి) ఏదీ, చూడనివ్వండీ-ఆ నాదే, (ఆశ్చర్యంతో) మీ కెలా దొరికిందీ!

సేన్:—చివరి కవిత్వంగూడా నీదేనా?

"హిస్టరీక్లాసులో ఎందుకులేట్
నాహృదయగవాక్షపు జాలియేట్ !"

విహాం:—దస్తూరి నాదేకాని రచన భూతోది!

సేన్:—భూతో? పూర్తిపేరేమిటి అతనిది?

విహాం:—భూతనాథ పాలిత్.

సేన్:—అడ్రసు?

విహా:—5 A, ఖల్లామి యా స్ట్రీట్.

సేన్:—(గంటనొక్కి, వచ్చిన కానిస్టేబిల్‌తో) బదరుద్దీన్ను పిలువు. (బదరుద్దీన్ వచ్చి సలాంచేస్తాడు) 5 ఏ, ఖల్లామియా స్ట్రీట్‌లో ఉండే భూతనాథపాలిత్‌ను అరెస్టుచేసి తీసుకురా.

విహాం:—(ఒకమాటు సేన వంకా ఒకమాటు బదరుద్దీన్ వంకా విస్మయంతో చూసి, వాడు వెళ్ళి పోయినాక) మమ్మల్నందర్నీ ఈవిధంగా హారెస్ చేస్తున్నారెందుకు, సార్! రాత్రంతా దోమలబాధతో చచ్చాము.

సేన్:—(గద్దిస్తూ) Shut up. హాఅమ్మాయికి లౌలెటర్ రాసిందెందుకో ముందు జవాబు చెప్పు

విహాం:—ఊరికనే.

సేన్:—ఊరికనే అంటే!

విహాం:—నలుగురూ రాయటంచూసి నేనూ రాశాను ఒకనాడు!

సేన్:—(అతనివంక ఉరిమిచూసి, ఏదో అనబోయి నిగ్రహించుకుని,) విమల ఎక్కడికి లేచిపోయిందో నీకు తెలుసునా?

విహాం:—లేచిపోయిందా! నాకు తెలియదే!

సేన్:—నిజం చెప్పు?

విహాం:—నిజమండీ. నేను ఇదే వినడం!

సేన్:—(కాగితం పెన్సిలూ ముందుకు పెట్టి) ఈ కాగితంమీద 'విమల ఎక్కడున్నదో నాకు తెలియదు' అనిరాసిసంతకం పెట్టు. (విహంగమ్ సంతకంచేస్తాడు) అగదిలో అతన్నికూడా పిల్చుకురా.

(విహంగమబాబుపోయి భూషణ బాబుని పిలుచుకొస్తాడు)

సేన్:—(భూషణ్‌తో) ఇక్కడ సంతకంపెట్టు. (భూషణ్ సంతకం చేస్తాడు.) ఇకపో. (భూషణ్‌తో విహంగమబాబు కూడా పోతుంటే) నువ్వు పోమాకు. (భూషణ్ వెళ్లిపోతాడు.)

సేన్:—(విహంగమబాబుతో) కాలేజీలో విమల ఏయే కుర్రవాడితో స్నేహంగా ఉంటుందో నీకు తెలుసునా? నిజంచెప్పావంటే విన్నొదిలి పెడతాను.

విహాం:— నిజంచెప్పితే నమ్ముతారా?

సేన్:—తప్పకుండా.

విహాం:—కాలేజీలో కుర్రవాళ్ళంతా ఆమెతో స్నేహం చేసుకోవాలని మహా తంటాలు పడుతున్నారు. కాని ఆమె ఎవ్వర్నీ దగ్గరికి చేరనివ్వటంలేదు! ఇంద్రలాలుకి మరీపిచ్చి ఎక్కింది—నవీమోహన్—

సేన్:—(పళ్ళతో పెదవి బిగపట్టి కోపం నిగ్రహించుకుని) అనవసరపు

సంగతులు కట్టిపెట్టి, విమల అందరిలోకీ ఎవరితో ఎక్కువ కలిసి తిరుగుతూ ఉంటుందో చెప్పు—నీకు తెలుసునా ?

విహం:—నాకు తెలియదు.

సేన్:—ఐతే పోయి ఆగదిలో కూర్చో!—స్కౌండ్రల్స్!

(విహంగమబాబు, స్లిప్పర్సు చటచట మనిపిస్తూ వెళ్లిపోతాడు. సేన్ మళ్లీ గంటనొక్కితే కానిస్టేబిల్ వస్తాడు) ఇంద్రలాల్‌ను పిలువు, (సేన్, ఇంద్రలాలు రాసిన ఉత్తరం చదువుతూ ఉండగా అతనువస్తాడు. అతనిముఖం చూస్తేనేచాలు, కవి అని చెప్పవచ్చు. బాబ్డ్‌జుట్టూ, కళ్ళజోడూ, పంజాబులాల్చీ, ఉత్తరీయం వల్లెవాటూ—మీసాలూ గడ్డం లేదు, ముఖంలోనూ కళ్ళలోనూ విరహభావం. ఇంద్రలాల్ నమస్కారం చెయ్యడు. ఆశ్చర్యంతో సేన్‌ముఖం వంక చూస్తూ ఉంటాడు.)

సేన్:—నీపూర్తిపేరు ? (ఇంద్రలాల్ జవాబుచెప్పడు. అలాగే చూస్తూఉంటాడు.) ఏమిటలా చూస్తావు!

ఇంద్ర:—(మామూలు ప్రపంచంలోకివచ్చి, వినయంతో) తమరేనా మిస్ విమలాదేవిగారి పితృపాదులు ?

సేన్:—ఆఁ. నీకు ఏమేం తెలుసు, ఆపిల్ల నిగురించి ?

ఇంద్ర:—(సకిలించి గొంతు సరిచేసుకుని) తమకుమార్తె విమలాదేవిగారు (మళ్ళీగొంతు సరిచేసుకుని) విమలాదేవిగారు ఆదర్శ స్త్రీరత్నమని నానమ్మకం. మనం సీతా, సావిత్రీ, గార్గీ, లీలావతీ మొదలైనవాళ్ళని పట్టుకునే-

సేన్:—(బిగ్గరగా) Shut up !

(ఇంద్రలాలు తత్తరపోయి ఆగుతాడు. సేన్ అతనివంక తీవ్రంగా చూస్తూఉంటాడు. ఇంద్రలాలు కొంచెం ధైర్యం తెచ్చుకుని మళ్ళీ మొదలు పెడతాడు.)

ఇంద్ర:—అనుగ్రహించి నామనవి వినండి. ఇంతకుపూర్వం రెండు మూడు సార్లు తమదగ్గరికి రావాలని ప్రయత్నించాను. కాని వాకిట్లో బంట్రోతు నన్ను లోపలికి రానివ్వలేదు. ఇప్పుడు అదృష్టవశాత్తూ తమదగ్గరికి చేరుకో గలిగాను. ఇక నామనసులో సంగతులన్నీ తమకు విన్నవించుకుంటాను... అంటే—

సేన్:—ఈ ఉత్తరం నువ్వురాసిందేనా ? (ఉత్తరంతీస్తాడు)

ఇంద్ర:—ఏదీ ఇలా యివ్వండీ! ఈఉత్తరం తమ దగ్గరకెలావచ్చిందీ? (ఉత్తరం తీసుకుని చదువుతాడు. సేన్ తీవ్రంగా చూస్తూ ఉంటాడు.) పయిందబి కల ముక మాటివండి - ఓ, నా జేబులోనే ఉంది-చంద్రుడిలో పొరపాటున 'ద'కు వట్రుసుడి యిచ్చాను-మార్చాలి-(జేబులోనించి కలం తీసి, కూర్చుని దిద్దబోతాడు. సేన్ లేచివచ్చి చేతిలో ఉత్తరం లాక్కుని మళ్ళీ కూర్చుని.)

సేన్:—నా ప్రశ్నకి జవాబివ్వు! ఈవుత్తరం రాసింది నువ్వేనా ?

ఇంద్ర:—అఁ-ఇదేకాదు, నేనింకా చాలా రాశాను—ఈ విషయం లోనే నేను తమతో మాట్లాడాలని అనుకుంటున్నది కూడా.

సేన్:—ఏం మాట్లాడతావు ?

ఇంద్ర:—నేను ముందుగానే తమకు మనవిచేశాను-అంటే, (భారమైన గొంతుతో) మిస్ విమలాదేవిగారు ఆదర్శ స్త్రీ రత్నమని నానమ్మకమని. వారితో పరిచయమైన నాటినించీ నేను వారికి నామనసులోని శ్రద్ధాభక్తు లను నిస్సంకోచంగా వెల్లడిస్తూనే వస్తున్నాను !

సేన్:—(బిగ్గరగా) రాస్కెల్ ! శ్రద్ధను వెల్లడిస్తున్నావా? బెత్తంతో వీపు పగల గొడితేకాని నీతల తిక్క కుదరదు !

ఇంద్ర:—మిస్ విమలాదేవిగారు ఈ సంగతులన్నీ తమకు నిస్సం కోచంగా చెప్పమన్నారు. తమ రిష్టపడితే—

సేన్:—ఇష్టపడితే ?

ఇంద్ర:—అంటే—(కొంచెం వెనక ముందాడి) అంటే, నేను వారిని పత్నిగా స్వీకరించి ధన్యుణ్ణి కావాలిని అనుకుంటున్నాను.

సేన్:—పెళ్ళి చేసుకోవాలనుకున్నావా ! విమలని ?

ఇంద్ర:—చిత్తం.

సేన్:—నా కూతుర్ని పెళ్ళి చేసుకునే యోగ్యత నీకుందా? నీతండ్రి ఏం చేస్తాడు ?

ఇంద్ర:—గుమస్తా.

సేన్:—జీత మెంతా ?

ఇంద్ర:—ఎనభైయూపాయలు.

సేన్:—ను వ్వేం చేస్తున్నావు ?

ఇంద్ర:—ఫర్డ్ యియరు చదువుతున్నాను.

సేన్:—అన్న దమ్ముళ్ళూ అక్క చెల్లెళ్ళూ ఉన్నారా ?

ఇంద్ర:—ఇద్దరు తమ్ముళ్ళూ నలుగురు చెల్లెళ్ళూ.

సేన్:—చెల్లెళ్ళలో ఎవరికన్నా పెళ్ళయిందా ?

ఇంద్ర:—ఉహుఁ.

సేన్:—నీ పూర్తి పేరేమిటి ?

ఇంద్ర:—ఇంద్రలాల్ పోద్దార్.

సేన్:—నీకు విమలని పెళ్ళి చేసుకోవాలని ఉందా ?

ఇంద్ర:—ఆఁ. (సేన్ ఆశ్చర్యంతో చూస్తూ ఉంటాడు.) నేను మనవి చేసుకోవలసిందంతా మనవి చేసుకున్నాను, ఇక తమ అనుజ్ఞ —

సేన్:—I shall beat you black and blue.

ఇంద్ర:—విమలాదేవిగారి కొరకు నేనెటువంటి బాధనైననూ నవ్వు ముఖముతో సహించుటకు—

సేన్:—Shut up you fool ! విమల ఇప్పుడెక్కడ ఉందో నీకు తెలుసా ?

ఇంద్ర:—ఇవ్వాళ కాలేజీకి సెలవుగా. నూటికి తొంభైపాళ్ళు ఇంట్లోనే ఉంటుంది.

సేన్:—నన్ను మోసం చెయ్యాలని చూడమాకు. You can't pull my leg. నిన్నటినుంచీ విమల కనిపించటంలేదు.

ఇంద్ర:—అలాగా !

సేన్:—ఎక్కడికెళ్ళిందో నీకు తెలుసా ?

ఇంద్ర:—ఉహుఁ. నాకు తెలియదండీ.

సేన్:—అయితే ఈ కాగితంమీద సంతకం చెయ్యి—(ఇదివరకు సంతకాలైన కాగితమిస్తూ) please remember you shall have a very nasty time if your statement is untrue.

ఇంద్ర:—[కాగితంమీద సంతకం చేసియిచ్చి హఠాత్తుగా గుండె పట్టుకుని] నాకు బాధగా ఉంది—చాలా బాధగా ఉంది.

సేన్:—పోయి ఆ గదిలో కూర్చో.

[ఇంద్రలాల్ పక్కగదిలోకి వెళ్లిపోతాడు. సేన్ గంటనొక్కితే కాన్‌స్టేబిలు వస్తాడు.]

సేన్:—అమియబాబును పిలువు.

[కాన్‌స్టేబిల్ వెళ్ళిన కాసేపటికి అమియబాబు వస్తాడు. బలిష్ఠమైన దేహం. పోకిరీవాలకం. హాఫ్‌షర్టు. కుచ్చెళ్ళు వెనక్కు దోపాడు. కాళ్ళకు కాన్వాస్ షూస్.]

అమియ:—మమ్మల్ని ఇక్కడెందుకు అటకాయించారో నేను తెలుసుకోవచ్చునా ?

సేన్:—[కళ్ళు ఎర్రచేసి] మీరంతా క్రిమినల్సు.

అమియ:—క్రిమినల్సా ?

సేన్:—ఆc! ఈ ఉత్తరం రాసింది ఎవరూ? [ఉత్తరంచూపుతాడు.]

అమియ:—ఏదీ! [ఉత్తరం తీసుకుని చూసి] ఎవరిదో నాకు తెలియదు?

సేన్:—నువ్వు రాసిందికాదా ?

అమియ:—ఊహుc.

సేన్:—కింద 'అమియ' అనే సంతకం ఎవరిది మరి ?

అమియ:—ఏమో, మా కాలేజీలో ఏడుగురు ఉన్నారు నాపేరు వాళ్లు. త్రైమూరు అమియ, కవి అమియ, అమియదత్తు, అమియసేన్, అమియనాగ్, ప్లేయర్ అమియ—నేనూ !

సేన్:—నీపేరేమిటి ?

అమియ:—అమియ ఘోషాల్.

సేన్:—[తెల్లకాగితం ముందుకుపెట్టి] మిగతావాళ్ళ పేర్లూ అడ్రసులూ రాయి దీనిమీద.

అమియ:—ఎందుకు ?

సేన్:—Because I order you to do so.

అమియ:—నావల్లకాదు.

సేన్:—కాదా ?

అమియ:—ఊహుc, ఒకళ్లమీద పితూర్లుచెప్పే స్వభావంకాదు నాది.

సేన్:—I order you again (అమియ కదలడు.) నేనుచెప్పింది చెయ్యి!

అమియ:—వీళ్ల పేర్లు మీ కెందుకూ?

సేన్:—(కనుబొమలు చిట్లించి ఒక్క క్షణం అమియవంక చూసి) ఈ తప్పుకే నిన్ను జైలుకు పంపవచ్చు—తెలుసునా నీకు!

అమియ:—ఏ తప్పుకూ!

సేన్:—You are refusing to help law and justice.

అమియ:—జైలుకి పోవటమంటే నాకేమీభయంలేదు. నాన్ కో ఆపరేషన్‌లో ఆరుమాసాలు ఉండివచ్చాను.

సేన్:—నువ్వు వీళ్ళ పేర్లు రాస్తావా, రాయవా?

అమియ:—రాయను.

సేన్:—(ఉత్తరం చూపుతూ) ఈ ఉత్తరం రాసింది నువ్వు కాదా?

అమియ:—ఉహుఁ! కాని, నాదనిచెప్పకుంటే వ్యవహారం తేలిపోయే ట్టుగా ఉంటే అబద్ధమాడటానికి నేను వెనక్కి తీయను.

సేన్:—మా అమ్మాయి విమల ఎక్కడుందో నీకు తెలుసా?

అమియ:—మీఅమ్మాయి ఎక్కడుందో మీకు తెలియాలి? నా కెలా తెలుస్తుంది?

సేన్:—ఇదుగో అనవసరపు వాగుడు వాగమాకు-I shall tear out your dirty tongue. మా అమ్మాయి ఎక్కడుందో నీకు తెలుసునా తెలియదా? yes or no!

అమియ:—No!

సేన్:—విమలనిగురించి నీకు ఏమేం తెలుసు?

అమియ:—చాలా తెలుసు, కాని చెప్పను.

సేన్:—I know how to break you and your like. పో, ఆ గదిలో కూర్చో! రాస్కెల్స్!

[కంట నొక్కుతాడు. కాన్‌స్టేబిల్‌తోపాటు విమలకూడా వస్తుంది. ఆమె వెనక నే ప్రొఫెసర్ ధీరేన్‌బాబు కూడా ఉన్నాడు.]

సేన్:—అరే, విమలే!

విమల—[నవ్వుతూ] మేమిద్దరం నీ ఆశీర్వాదంకోసం వచ్చాం నాన్నా.

సేన్:—ఆశీర్వాదమా?

ధీరేన్:—[ముందుకువచ్చి] నేను తమ కుమార్తెను వివాహం చేసుకున్నానండీ.

సేన్:—[ఆశ్చర్యంతో] పెళ్ళిచేసుకున్నారా! మీరు! మా అమ్మాయిని!

ధీరేన్:—చిత్తం మేము చాలా కాలం క్రిందటే నిశ్చయించుకున్నాము.

విమల:—[అలిగినట్లుగా] నీకు కోపం రాలేదుగా నాన్నా!

సేన్:—[ధీరేన్‌తో] మీరేకాదూ, అమ్మాయి ఫిలాసఫీ ప్రొఫెసరు?

ధీరేన్:—[వికసించిన మొహంతో] ఆc. ఐతే ఏం? శిష్యురాలిని చేసుకోవచ్చునని శాస్త్రాల్లో ఉంది.

సేన్:—ఈవిధంగా చాటున పెళ్ళిచేసుకోటానికి కారణం ?

ధీరేన్:—చెప్పితే మీరు వొప్పుకునే వారుకారు.

[సేన్ విస్తుపోయి నుంచుంటాడు.]

విమల:—మామీదకోపమా నాన్నా!

సేన్:—నేను వొప్పుకోనని మీకెలా తెలిసింది? ఏవిధంగా చూసినా మీరు మా అమ్మాయికి తగనివారు కారే!

ధీరేన్:—మేము యాదవులం-మీరు కాయస్థులూ!

సేన్:—యాదవులా! ఆc—ఏమిటీ? యాదవులా! యాదవులా!

ధీరేన్:—కాని చట్టప్రకారం తప్పేమీ లేదు. మీ అమ్మాయి మైనరు కాదు. ఇద్దరం ఇష్టపడే రిజిష్టరు మ్యారేజి చేసుకున్నాము.

సేన్:—No, no, this cannot be. I want an explanation for all this (బిగ్గరగా) do you hear, I want an explanation.

[ఎవ్వరూ జవాబివ్వరు, సేన్ పైపు పీలుస్తాడు, రెండు మూడుసార్లు. పొగరాదు. విద్యార్థులు గదిలోనుంచి వాకిట్లోకివచ్చి నుంచుంటారు. ప్రొఫెసరు కనపడగానే అంతా ఒక్కమాటుగా 'నమస్కారం! మాస్టరుగారూ!' అంటారు.]



# మానవుడు

కన్ను ఆర్పకుండా చూస్తున్నాను.

గంగా గర్భంలో సూర్యుడు అస్తమిస్తున్నాడు. పశ్చిమాకాశాన వర్ణించటానికి వీలులేనన్ని వర్ణాలు, వివిధ ఆకారాలతో ఉన్న మేఘాలు స్వప్నరాజ్యంలాగా ఉన్నై. తెల్లటి తెరచాపలు ఎత్తుకుని చిన్న-చిన్న నౌకలు ప్రవాహానికి ఎదురుగా మెల్లగా పోతున్నవి. నదిపైన చేపల కోసం ఎగురుతున్న కొంగలు సాంధ్య కాంతిలో మెరుస్తున్నై. అటు ఇటూ కదులుతున్న నదీజలం బంగారు కాంతితో ప్రకాశిస్తున్నది.

ప్రతి తరంగం కొననూ బంగారు కాంతి.

పచ్చటి బయలులో దేవాలయం.

దేవాలయం ముందు నెమరువేస్తున్న బలిసిన ఆవు.

ఇంకొంచెం దూరాన కళ్లు మూసుకు పడుకున్న పిల్లి.

దేవాలయంలోంచి కరుణాపూరితమైన నౌబత్ వాద్యం.

ఎటుచూచినా స్వాప్నిక ప్రపంచంలా ఉంది.

నది ఒడ్డున పచ్చిగడ్డిమీద తన్మయుడనై కూర్చున్నాను.

ఈ ప్రపంచమెంత సుందరమైనది!—అని అనుకొంటున్నాను.

* * *

హఠాత్తుగా చకితుడనయాను.

నా వెనకగా ఎవరో పట్టుకుపోయిన గొంతుతో మాట్లాడుతున్నారు.

తిరిగి చూశాను-ఒక బిచ్చగాడు; అతని వెంట ఒక పిల్ల.

బిచ్చగాడికి కుష్ఠువ్యాధి.

చేతుల్నీ కాళ్ళనూ వేళ్లు లేవు.

ముక్కు ఉండేచోట రంధ్రం మాత్రం ఉంది.

వికృతమూ భీభత్సమూగా ఉన్న నోటితో ముక్కుడి ఉచ్చారణతో బిచ్చం అడుగుతున్నాడు.

''ఒక్క కానీ వేయండి, దొరా—''

పక్కనున్న పిల్లకూడా అదే ఉచ్చరించింది.

పిల్లకు పదహారూ పదిహేడు ఏళ్ళు ఉంటై—

ఒంట్లో జబ్బుగా ఉన్నట్టు కనిపించటంలేదు.

చింపిరిగుడ్డ ఒకటి కట్టుకున్నది.

గుడ్డ చిరుగులలోనుంచి కొత్తగా వికసిస్తూ ఉన్న ఆమె యౌవనం బయటికి తొంగిచూస్తున్నది.

కాని దారిద్ర్యంతో అది మలినమై ఉంది.

అయినా అది యౌవన సంపదే.

ఆ పిల్లకు ఈ సంగతి తెలుసు.

ఆమె ముఖంలోనూ చూపులోనూ భావభంగిమలోనూ ఈ విషయం వ్యక్తం చేస్తున్నది.

ఇంతకు పూర్వం కుష్ఠువ్యాధి బిచ్చగాళ్ళని, బిచ్చమెత్తుకున్న యువతుల్నే చాలామందిని చూశాను.

కాని ఇవ్వాళ వీళ్ళను కొత్తదృష్టితో చూడగలిగాను.

రోగమూ, ఆరోగ్యమూ, రెండూ పక్కపక్కనే నిలబడి ఉన్నై— ఒకే ఉద్దేశ్యంతో.

ఆకలి మంటకు అన్నం కావాలి.

యాచన వీళ్ళ వృత్తి.

ఈ వృత్తిలో ఒకరు వ్యాధిని పెట్టుబడిగా పెట్టుకున్నారు—రెండో వారు యౌవనాన్ని.

ఇద్దరికీ చెరో కానీ ఇచ్చాను.

వాళ్ళు వెళ్ళిపోయారు.

కుష్ఠురోగి కర్ర ఊతం చేసుకుని కాళ్ళు యీడ్చుకుంటూ—

కుర్రది వొయ్యారంగా, కొంచెంమారం పోయి ఒక మాటు వెనక్కు తిరిగి చూసింది.

ముఖాన చిరునవ్వు.

ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయాను.

ఆమె చిరిగిన గుడ్డలోని రంధ్రాలు నా కళ్ళముందు కనపడసాగినై.

* * *

హఠాత్తుగా పెద్ద చీత్కారం.

చకితుడనై వెనక్కు తిరిగి చూశాను—పిల్లి ఒక ఎలుకను పట్టింది. ఇంతకుముందు పొంచి ఉంది.

ఆవుకూడా అంబా అని అరిచింది.

అటు చూశాను-పాలు పిండుతున్నారు. ఒకడు పాలు పితుకుతున్నాడు; రెండోవాడు ఆవుమీదికి దూకుతున్న దూడను గట్టిగా లాగిపట్టాడు.

దాని కరుణాపూరితమైన అరుపు సాంధ్య ప్రశాంతతను భంగపరచ సాగింది.

*　　　*　　　*

ఆకాశాన నల్లటి రెక్కలు చాచి బారులు బారులుగా నీళ్ళ కాకులు పోతున్నై. తెరచాప దించిన పడవలు వలలు వేసి చేపలు పట్టుతున్నై.

పశ్చిమాకాశం వేపు చూశాను.

ఆ వెనకటి కాంతులు లేవు.

అస్తమిస్తున్న రవి కాంతివిహీన మవుతున్నాడు.

చీకటి పడుతున్నది.

నేను లేచాను.

దోవ నడుస్తూ చూశాను. ఇందాక చూచిన యువతి, బిచ్చగత్తె ఆ మసక చీకటిలో గల్లీ మలుపున నిలబడి, రౌడీలాంటి వాడితో సరస మాడుతోంది.

ఇంటికి వచ్చి విన్నాను—ప్రక్క ఇంటి ఆవిడ పిల్లను కన్నదట. ఆ ఆనందం శంఖధ్వనిద్వారా వ్యక్తపరుస్తున్నారు. కొద్ది రోజులక్రితమే సంతానాన్ని పోగొట్టుకున్న నా భార్య ప్రక్క ఇంటి పిల్లవాడి చిరాయువుకోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తోంది.

నేను పరధ్యానంగా కుర్చీలో కూచుని వార్తాపత్రిక పేజీలు తిరగ వేస్తున్నాను.

ఎన్ని అవాంతరాలనో తప్పించుకుని ఒక సతి భర్తతో పాటు చితి ఎక్కిందట.

ఎన్నిసార్లో భంగపడినప్పటికీ ఇంకో జట్టు వెర్రి ధైర్యస్థులు ఎవ రెస్టు ఎక్కటానికి నిర్ణయించుకున్నారట.

చైనా జపాను యుద్ధం.
స్పెయిను.
బెంగాలీవాళ్ళు పడుతున్న నానాకష్టాలు.
కాంగ్రెస్—
తలుపు గడియ కదిలింది.

పోస్టుప్యూను తంతి తెచ్చాడు. శుభవార్త. నాకొరగాని సోదరుడికి ఉద్యోగం దొరికింది. ఈ ఉద్యోగంకోసం ఐదువందల దరఖాస్తులు వచ్చినై.

చదువులోనూ, తెలివితేటల్లోనూ, నడతలోనూ మావాడికంటే మంచి వాళ్ళు ఎంతోమంది ఉన్నారు. ఐనా వాళ్ళందర్నీ వెనక్కునెట్టి మా వాడు సిఫారసు బలంతో ఈ ఉద్యోగం సంపాదించాడు.

ఇంత అన్యాయం జరిగినా నేనేమీ చలించలేదు.
పైగా సంతోషించాను.

మిద్దెపైకి ఎక్కాను. నల్లటి మేఘాలను ఛేదించుకుని చంద్రుడు అపురూపమైన శోభతో పైకి వస్తున్నాడు.

పూర్వాకాశం వెన్నెలలో స్నానమాడుతోంది.
విస్మయంతో ముగ్ధుడనై చూస్తూ ఉండిపోయాను.

ఈ ఆనందాన్ని పూర్తిగా జీర్ణించుకోవాలంటే సిగరెట్టు ముట్టించటం అవసరం.

జేబులో చెయ్యిపెట్టి చూశాను—సిగరెట్టుకేసు ఖాళీ.
సిగరెట్లు తేవడం మరిచిపోయాను.
మళ్ళీ నా మనసంతా చెడిపోయింది.

మెరుస్తూఉన్న చంద్రుణ్ణి ఆకాశంలోనే అట్టిపెట్టి సిగరెట్లు కొనటానికి గబగబా దిగి వచ్చాను.



# నమూనా

ప్రకాశ్:—ఇవాళకూడా దొరకలేదా బియ్యం?

వినోద్:—(విచారంగా నవ్వి) ఉంటేగా దొరకటానికి!

ప్రకాశ్:—నువ్వు సరిగ్గా ప్రయత్నించటం లేదు.

వినోద్:—ఇంకా ఎలా ప్రయత్నించమంటావు చెప్పు? మొన్నపోయి తిట్లుతిన్నాను. నిన్నపోయి గూటిపోట్లు తిన్నాను, ఇవ్వాళ మాకూ—(కుడిపాదం ఎత్తాడు. బొటనవ్రేలు నెత్తురు ముద్దలా ఉంటుంది.)

ప్రకాశ్:—ఛీ, ఛీ, ఏమిటిది? ఎందుకైంది అలా?

వినోద్:—నిన్న వానలో బూట్లు తడిసినై. ఇవ్వాళ ఉత్తకాళ్ళతో వెళ్ళాను. బూట్లు వేసుకున్న కుర్రవాడొకడు ఇలా తొక్కాడు.

ప్రకాశ్:—నువ్వుపోవడం ఎందుకూ అసలు! జీవాని పంపకూడదూ?

వినోద్:—పోతే నేను కాదన్నానా?

ప్రకాశ్:—అసలు చెప్పావా, వాడికి?

వినోద్:—ఏమి చెప్పేది! పిల్లలు పెద్దవాళ్ళయినప్పటినించీ వాళ్ళకి నేను ఏమీ చెప్పడంలేదు. ఇవ్వాళ మాత్రం వాళ్ళ స్వేచ్ఛకి అడ్డురావటం ఎందుకూ? (కొంచెం ఆగి) అదిగాక నాపిల్లల్ని ఆ గుంపులోకి పంపటంకూడా నాకు ఇష్టం లేదు.

ప్రకాశ్:—మరి జీవా ఏమి చేస్తాడు రోజంతా?

వినోద్:—ఏమో! ఎక్కువభాగం వాడి స్నేహితుడు వీరేన్ ఇంట్లో ఉంటాడనుకుంటాను.

ప్రకాశ్:—తిండివేళకిమాత్రం తప్పకుండా చేర్తాడన్న మాట!

వినోద్:—రాకపోతే ఎక్కడికి పోతాడు, చెప్పూ? అదీ ఒక్కొక్క రోజున అసలు రావటమే లేదు. (ఇద్దరూ కాసేపు మాట్లాడరు)

ప్రకాశ్:—జీవితమంతా పంతులుపనిలో గడిపావు. కాని పిల్లల్ని అదుపు ఆజ్ఞల్లో ఉంచడం నేర్చుకోలేదు. నీభార్యబ్రతికిఉండగా నేనయం.

వినోద్:—నన్నేం చావమంటావు చెప్పు! నాస్వభావం నేనుమార్చుకోలేను. పిల్లలా పెద్దవాళ్ళయారు. చదువుసంధ్యలు నేర్చుకున్నారు. ఈనాడు వాళ్ళనోటికి కళ్లెం పెట్టిమాత్రం ఎంతదూరం ఆపగలను, నువ్వే చెప్పూ?

ప్రకాశ్:—నువ్విలా వదిలి ఊరుకోబట్టే శివుడూ, సవితా జైలులో పడ్డారు. నువ్వు గనక వద్దన్నట్టయితే వాళ్ళిప్పుడూ ఆందోళనలో పాల్గొనేవాళ్ళు కారు. (వినోద్ మాట్లాడలేదు. బట్టతల చేత్తో నిమురు తుంటున్నాడు. ఇంట్లోనించి 'టుంగ్, టుంగ్'మని సితారు వినిపించింది.)

ప్రకాశ్:—అమితా కాదూ?

వినోద్:—ఆఁ.

ప్రకాశ్:—భలేవాళ్ళు మీరు! ఇంట్లో తింటానికి బియ్యం లేక పోయినా, అమ్మాయి కూర్చుని చక్కగా సితారు వాయిస్తుంది!

వినోద్:—సితార్ పగలగొట్టిపారేస్తే బియ్యం దొరుకుతాయా?

ప్రకాశ్: —ఊఁ! సరే, నిన్ను ఒక్క సంగతి అడగాలని రోజూ మర్చిపోతున్నాను. సుఖమయబాబు వ్యవహారం ఏమిటీ? అతనితో అను కూలంగా ఉంటే మీకు బియ్యం సులభంగా దొరికేవే? గొప్పవారి అబ్బాయి, గొప్ప ఉద్యోగం చేస్తున్నాడు, గొప్ప గొప్పవారితో పరిచయం ఉంది; మీకు కావలసినన్ని బియ్యం సప్లైచేయగలడు. అతనితో పేచీ ఏమిటీ?

వినోద్:—నాకు సరిగ్గా తెలియదు. మన శివుడి వెంబడి అప్పుడప్పుడు ఇంటికి వస్తూవుండేవాడు. వాడు జైలుకు పోయిన తర్వాతకూడా చాలా సార్లు వచ్చాడు. ఒకనాడు హఠాత్తుగా అమిత అతన్ని ఇంట్లోనించి వెళ్ళగొట్టుతున్నది. నేను అతను వెళ్ళిపోయినాక సంగతి ఏమిటని అడిగాను. కాని, అమిత ఏమీ చెప్పలేదు. నేను ఏదో ప్రణయసంబంధ మైన వ్యవహారమనుకున్నాను.

ప్రకాశ్:—ఎంత సులభంగా చెప్పేశావు ఈ మాట!

వినోద్:—నువ్వు నా బాల్యమిత్రుడివి కాబట్టి చెప్పాను. అదీకాక ఇలాంటి విషయాలలో నా కెట్టి ఆటంకమూలేదు. ఉన్నప్పటికికూడా ఆగేది ఏమీలేదు. ప్రతింటా పెళ్ళికాని పిల్లలు, ఈడువచ్చిన వాళ్ళు, చాలామంది ఉన్నారు. మన సమాజపరిస్థితులనుబట్టి వాళ్ళకి మర్యాదగా పెళ్ళిళ్ళుచేయటానికీ వీల్లేదు. మగవాళ్ళనించి వేరుచెయ్యటానికీ వీల్లేదు. కాబట్టి కలవనివ్వాలి. అలాంటప్పుడు దాని అనివార్య ఫలితానికికూడా తల వొగ్గవలసి ఉంటుంది.

ప్రకాశ్:—ఊఁ, బాగుంది!

(ఇద్దరూ కాసేపు మాట్లాడరు. లోపలినించి సితారుమీద 'తిలక్ కామోద్' రాగం వినిపిస్తూ ఉంటుంది.)

ప్ర:—హూం. భలే బాగా తిరిగింది చెయ్యి! సరే, నేనుపోయివస్తాను.

(ప్రకాశ్ వెళ్ళిపోతాడు. సితార్ మోగుతూనే ఉంటుంది. వినోదుడు కూర్చొబడి కళ్లుమూసుకుంటాడు. అతని పూర్వవిద్యార్థి సురేన్ వస్తాడు.)

వినోద్:—రావోయి సురేన్! సంగతు లేమిటి?

సురేన్:—మీకు పప్పు బియ్యాలు దొరకుతున్నాయా, సార్?

వినోద్:—ఎక్కడ దొరుకుతున్నై!

సురేన్:—హోర్డింగ్ స్టాప్ చెయ్యంది బియ్యం దొరకవు సార్!

వినోద్:—ఎవరు చేస్తున్నారు హోర్డింగ్?

సురేన్:—బోలెడుంది సార్, బోలెడుంది. మేము రోజూ ఎంతోమంది ఇళ్ళలోనుంచి బస్తాలకు బస్తాలు బియ్యం సీజ్ చేస్తున్నాము.

వినోద్:— నిజం? (సితార్ ధ్వని ఆగుతుంది)

సురేన్:— నేను మిమ్మల్ని ఒకటి అడగటానికి వచ్చాను. జీవాని మా 'ఫుడ్ ఫ్రంట్'లో జాయిన్ చేయించండి. చాలా బాగా ఉంటుంది.

వినోద్:—సముద్రాలను పీల్చుకుపోయేవాళ్ళని మీరేమీ చెయ్యలేక, ఎవరింట్లోనన్నా ఒక బక్కెటూ, రెండు బక్కెట్లూ నీళ్ళు పెట్టుకుంటే వాటికోసం బుర్ర బద్దలుకొట్టుకుంటూ రెందుకూ?

సురేన్:—ఊహుం. మీరసలుసమస్య సరిగా అర్థంచేసుకోలేదు సార్!

అమిత:—(వచ్చి) ఇంట్లో బియ్యమేమీ లేవునాన్నా. రమేశ్ కక్కాయి బస్తా విప్పదీయమంటావా, ఒకటి?

వినో:—ఊహుం. రమేశ్ మనదగ్గర అవి దాచుకున్నాడు. అతన్ని అడగకుండా బస్తావిప్పటం బాగుండదు. కొంచెం ఆగు, నేను బయటికి పోయివస్తా.

సురేన్:—ఎన్ని బస్తాలున్నై, మీదగ్గర?

వినోద్:—నావి కాదు, నా స్నేహితుడివి.

సురేన్:— అసలెన్ని బస్తాలు, చెప్పండీ?

వినోద్:—అయిదు.

సురేన్:—క్షమించండిసార్, మేము సీజ్ చేస్తాము.

వినోద్:—సీజ్ చేస్తారా?

సురేన్:—తప్పకుండా, ఇలాంటి విషయాల్లో మేమేమీ పార్షియాలిటీ చూపించము. మీరే కొంచం ఆలోచించి చూడండి—ఒకరు ఇంట్లో బియ్యాన్ని హోర్డుచేసి ఉంచడమూ, మిగతావాళ్లు స్టార్వు కావటం, న్యాయమంటారా? ఇప్పుడు హోర్డింగును ఆపటమే ప్రస్తుతం దేశసేవ చెయ్యటం. మీ జీవాని కూడా మా జట్టులోకి పంపండి. అమితాదీ, నీవుకూడా రాకూడదూ?

అమిత:—ఉహుఁ. నేను రాలేను.

సురేన్:—ఐతే జీవాని తప్పకుండా పంపండి.

అమిత:—వాడు వొప్పుకోడు. చక్కటి ఏ. ఆర్. పి. ఉద్యోగమే చెయ్యనన్నాడు.

సురేన్:—మీరన్నా కొంచెం చెప్పి చూడండి సార్.

వినోద్:—అలాగే. ఐతే మీరు నిజంగా రమేశుడి బియ్యం తీసుకుపోతారేమిటి?

సురేన్:—(నవ్వి) ఆమాకీ చిక్కినాక వదులుతామా, తప్పకుండా తీసుకుపోతాము. సరే నేను వస్తాను మళ్ళీ, మీరుమాత్రం జీవాకి తప్పకుండా చెప్పండి. (వెళ్తాడు.)

అమిత:—సురేన్ కమ్యూనిష్టు ఎప్పుడయ్యాడు! ఈ సంగతి తెలిస్తే వాడి ఎదట నేను బియ్యం సంగతే తెచ్చేదాన్ని కాను.

వినోద్:—సరే, నాబూట్లు ఎండిపొయ్యా? ఇంకోమాటు బయటికి పోయి ప్రయత్నించి చూస్తాను.

అమిత:—వద్దు. రెండు రోజులనించి నువ్వు దాదాపు ఉపవాసమే చేస్తున్నావు.

వినోద్:—మరి పోకపోతే ఎలా జరుగుతుంది తల్లీ? నువ్వుకూడా తినలేదుగా రెండు రోజులనించి. దోసకాయ ముక్క ఒకటి ఉంచాను, తిన్నావా?

అమిత:—ఆఁ.

వినోద్:—జీవా ఇవ్వాళ ఇంతవరకూ రాలేదు. పగలంతా ఏమి చేస్తాడో తెలియదు.

అమిత:—ఇవ్వాళ చాలా ఆలస్యమైన మాట నిజమే.

వినోద్:—నా చెప్పులు ఇలా తీసుకురా.

అమిత:—ఊహూఁ. ఇవ్వాళ నువ్వు బయటికి పోవద్దు.

వినోద్:—బయటికి పోకపోతే ఎలా జరుగుతుంది?

(ఇద్దరూ ఒకరివంక ఒకరు నిస్సహాయులులాగా చూసుకుంటారు.)

అమిత:—నువ్వు కొంచెం విశ్రాంతి తీసుకో నాన్నా! ఇవ్వాళ, నేను బయటికిపోయి వస్తాను.

వినోద్:—నువ్వుపోయి క్యూలో నుంచుంటావేమిటి?

అమిత:—ఊహూఁ. నాకు వేరే పని ఉంది.

వినోద్:—ఎక్కువ ఆలస్యం చేయమాకు.

[అమిత ఇంట్లోకి పోయి బయటికి పోవటానికి దుస్తులు మార్చివస్తుంది. ఇంట్లో తినటానికి గింజలు లేకపోయినా కట్టుకోటానికి గుడ్డలు మాత్రం పెట్టెలో కరువులేనట్లుగా ఉన్నై. అమిత అసలే చక్కనిది. ఈదుస్తుల్లో ఇంకా అందంగా ఉంది. వినోదబాబు కళ్ళుమూసుకుని ఈజీచైర్‌లో పండుకున్నాడు అమిత చప్పుడు చేయకుండా బయటికి వెళ్ళిపోయింది. వినోదబాబుకు కునుకు పట్టింది. ఆ కునుకులో అతనికి కల వచ్చింది. ఆ కలలో ప్రపంచంలోని మహా పురుషులంతా వినోదబాబు ఎదుటికి వచ్చి ఒక్కొరొక్కరే నుంచున్నారు.]

బుద్ధుడు:—చలించబోకు వినోద్. ఈప్రపంచంలో దుఃఖం ఉండక తప్పదు. నీ పనుల ద్వారానూ, నీ నడత ద్వారానూ దానిని జయించవలసి ఉంటుంది.

క్రీస్తు:—దుఃఖితుడివి కాబట్టే నువ్వు ధన్యుడివి. భగవంతుడు మనిషిని దుఃఖమనే అగ్నిలో కాల్చి పరిశుద్ధుణ్ణి చేస్తాడు.

చైతన్యుడు:—ఎవరిమీదా కోపించమాకు. ఎవ్వరిమీద అసహ్యం చుకోమాకు. అలా అయినట్లయితే నీకు దుఃఖం ఉండదు. అనురాగ స్పర్శవల్ల పాషాణం కూడా కరిగిపోతుంది.

రామకృష్ణ:—భేదబుద్ధివల్లనే ఈ కష్టాలు. నీవు ఏనాడయితే ఈ ప్రజలంతా సముద్రములోని అలలమాదిరిగా ఒకటే అనుకోగలవో, ఆనాడు నీకు కష్టాలు ఉండవు.

శంకరాచార్య:— కష్టమనేది ఎక్కడుంది? అంతా మాయ! నేనే సర్వం, మిగతా దంతామాయ, అని ఒకమాటు అనుకుని, అనుభవించి చూడు. ఇక నేమీ ఉండదు కష్టమనేది.

[ఒక్కొక్కరూ మళ్ళీ మాయమైపోయారు. ఇదివరకు వినోదుని గుండెలమీద ఏదో బరువుగా ఉన్నదల్లా ఇప్పుడు తీసేసినట్టు అయింది. ఆ నిద్రమత్తులోనే, అతను ప్రపంచంలోని తిరస్కారాలనూ, అవమానాలనూ, కష్టాలనూ నవ్వు ముఖంతో సహించగలనని అనుకున్నాడు. వాకిట్లో చప్పుడయింది. వినోదబాబు కళ్ళు తెరిచి చూచాడు—సుఖమయు బాబు గుమస్తా విపినుడు నుంచుని ఉన్నాడు.]

విపిన్:—(నమస్కరించి) సుఖమయుబాబు తమకోసం ఒక బస్తా బియ్యం పంపించారు. కూలీ బయట ఉన్నాడు. ఎక్కడ వేయించమంటారు చెప్పండి.

వినోద్:—నా కోసమా ?

విపిన్:—చిత్తం.

వినోద్:—అలాంటి సూచనేమీ లేదే! నాతో పంపుతానని చెప్పలేదు
(విపినుడు మాట్లాడడు)

వినోద్:—వారికి బియ్యం ఎక్కడ దొరికినై ?

వినోద్:—నాకెలా తెలుసు చెప్పండి! వారు గొప్పవారు.

కూలి:—(చాటున ఉండి) బాబూ!

వినోద్:—ఇంటి వెనుక తలుపు తెరిచి ఉంది. అక్కడ వరాండాలో వేయించిపో! (విపినుడు వెళ్ళి పోయాడు. అప్పుడే అమిత వచ్చింది.)

అమిత:—(కొంచెం సంతోషం తెచ్చుకుని) నాన్నా! భలే గమ్మత్తు జరిగింది. ఇల్లు దాటానో లేదో, దోవలో సుఖమయుబాబు కనుపించాడు. ఆయ నంతకే ఆయన నా దగ్గరికి వచ్చి—(కల్పించి చెప్పబోవటంవల్ల మాటలు సరిగా ఊతక లేదు.) అంటే—షేచీ తీన్చి వేశాను. లక్ష, అనుకోనీ, అన్నయ్య స్నేహితుడేగా.

వినోద్:—మంచిపని చేశావు.

అమిత:—ఇవ్వాళ ఆయన నన్ను ఒక సినిమాకు తీసుకుపోతానన్నాడు. పోయేదా ?

వినోద్:—పోదువుగాని, కాని, ముందు ఆ బియ్యపు బస్తా తిప్పిపంపు.

అమిత:—(ముఖం నల్లబడిపోతుంది.) బియ్యం ఇచ్చిపోయాడా ?

వినోద్:—ఆఁ.

అమిత:—ఏం, తీసుకుంటే నష్టమేం?

వినోద్:—చాలా హీనమైన పని అది.

అమిత:—(దృఢకంఠంతో) జీవన మరణ సమస్యలోకూడా హీనా హీనాలను గురించి విమర్శిస్తూ కూర్చోవటమా?

వినోద్:—మనుషులము కాబట్టి విమర్శించాలి. పశువులైతే అక్కర్లేదు. (విచారంగా నవ్వి) నన్ను నేనింకా పశుస్థితిలోకి తీసుకుపోలేకుండా ఉన్నానమ్మా.

అమిత:—కాని మాగతి ఎట్లా? మూడురోజులనించి అన్నం పోలేదు పొట్టలోకి! జీవా ఆకలిమంటతో మొహం తప్పించి తిరుగుతున్నాడు.

వినోద్:—అందరికీ ఎక్కడినించి దొరుకుతున్నాయో, మనకీ అక్కడినించే దొరుకుతై. నేను యివ్వాళ రాత్రినించి అక్కడికే పోయి పండుకోటానికి నిశ్చయించుకున్నాను.

[ఒక మూట చేత పట్టుకుని ప్రకాశ్ వచ్చాడు.]

ప్రకాశ్:—ఇదుగో తీసుకో. మా ఇంటిలో ఉన్నవాటిల్లో సగం తీసుకువచ్చాను, మా ఆవిడతో యుద్ధంచేసి.

వినోద్:—ఎందుకు అంత శ్రమ ప్రకాశ్! నేనిప్పుడే బయటికి పోతున్నాను, ఈమాటు తప్పక దొరుకుతై.

ప్రకాశ్—దొరికితే మళ్లీ మావి మాకు తీర్చు. నేనుకూడా ఖ్యానించే తీసుకువస్తున్నాను. సరేకాని, రోడ్డు ప్రక్కని ఒక శవం పడివుంది చూశావా? తిండీ తిప్పలూ లేక మొహంకూడా ఎండుకుపోయింది! దాని ప్రక్కగా వేలకొలది జనం పోతున్నారు. కాని, దానివంక ఎవ్వరూ చూడటం లేదు—అదేదో మనిషికాదు, ఎలిక అన్నట్లుగా.

[అమిత బియ్యపుమూట తీసుకుని ఇంటిలోకి పోయింది]

వినోద్:—ఇప్పుడు చస్తేనే శాంతి ఉంది.

(జీవా స్నేహితుడు వీరేన్ పరుగెత్తుకు వచ్చాడు.)

వీరేన్:—జీవా గొంతుకు ఉరేసుకున్నాడు.

ప్రకాశ్:—ఏమిటీ?

వీరేన్:—మా మాడ్లో అంతస్థుగదిలో వాడు ప్రొద్దుటినుంచీ మెదలకుండా పండుకున్నాడు. భోజనంవేళకి నేను పిలుద్దామని పోతిని గదా వ్రేలాడుతున్నాడు. మీరు రండి తొందరగా.

వినోద్:—(స్థిర కంఠంతో) పద, వస్తున్నాను.

(వీరేన్ వెళ్ళాడు. ఇద్దరూ కదలా మెదలకుండా కూర్చున్నారు)

ప్రకాశ్:—జరగవలసిందేమో జరిగిపోయింది. ఇక—

వినోద్:—ఆ సంగతి అలావుంచి, నా కొక్క దానికి జవాబివ్వూ? ఇవన్ని జరిగినాకూడా ప్రేమించడానికి వీలుందా? క్షమించటానికి వీలుందా? మాయ అని అంతా ఒక్కమాటే ఎగరగొట్టి వెయ్యటానికి వీలుందా? భగవంతుడు నన్ను దుఃఖమనే అగ్నిలో కాల్చి పరిశుద్ధుణ్ణి చేస్తున్నాడా?—ఈ కవిత్వంవల్ల నిజంగా మనస్సు తృప్తిపడుతుందా? చెప్పూ? (బిగ్గరగా) నాకు జవాబు చెప్పూ, చెప్పూ నాకు జవాబు?

[సురేన్ పరుగెత్తుకుంటూ వస్తాడు.]

సురేన్:—(గద్గద కంఠంతో) సార్, హ్యాపీ న్యూస్! ఒక శత్రువు పడిపోయాడు. ఇటలీ హ్యాజ్ సరెండర్డ్ అన్‌కండిషనల్లీ!

## లోపలా - బయటా

మన మనస్సును సాధారణంగా రెండు భాగాలుగా విభజింపవచ్చును. ఒకటి బయటిదీ—రెండోది లోపలిదీ. బయటకు కనబడే మనస్సు మర్యాదగానూ సంఘీభావంగానూ నాగరికతగానూ ఉంటుంది. కాని లోపలి మనస్సు అన్నివేళల సంఘీభావంగానూ నాగరికతగానూ ఉండదు—దాని నడకా చింతనాపద్ధతీ విచిత్రంగా ఉంటుంది. బయటి మనస్సు చేసే పనులు చూసి లోపలిమనస్సు ఒకప్పుడు నవ్వితే ఒకప్పుడు ఏడుస్తుంది—ఎప్పుడోకాని సమర్థించదు. వీటిపోట్లాట ప్రతినిత్యమూ ప్రతి క్షణమూ ఉండేదే. రామకిశోరబాబు లోపలి మనస్సు చాలాకాలంనుంచి శవప్రాయంగా పడి ఉన్నది. అది బయటి మనస్సుచేసే అత్యాచారంవల్ల చివికిపోయింది. ఈయన వకీలు. హంతకుణ్ణి కాపాడటానికి తప్పుడు సాక్ష్యం సృష్టించడంలోనూ జమీందారుకు సహాయం చేయటానికి బీద

ప్రజలను నాశనం చేయటంలోనూ, ఫోర్జరీ వీలునామాలు రాయించటంలోనూ, ఇంకా ఇలాంటి అన్ని పనులలోనూ ఈయన బయటి మనస్సు సహాయమే పొందుతుండేవాడు. లోపలి మనస్సు మొదట్లో ఈ పనులకు అడ్డుచెప్పి కొన్ని అనర్థాలు తెచ్చిపెట్టిందికూడా. కాని ఇప్పుడు ఏమీ జోక్యం చేసుకోటం లేదు.

ఆవాళ ఉదయం రామకిశోరబాబు బట్టతల చేత్తో నిమురుకుంటూ తోటలో పచారుచేస్తున్నాడు. ఒక విధవావిడదావాలో కొన్నాళ్ళనుంచి ఈయన మునిగి తేలుతున్నాడు. ఇవ్వాళ ఆ కేసు విచారణ--అందుచేత కొంచెం వ్యాకులపాటుగా ఉన్నాడు—పరధ్యానంగా ఉన్నాడని వేరే చెప్పట మెందుకు?

ఈలాంటి సమయంలో మధ్యకారు పెద్దమనిషి ఒకాయనవచ్చి నమస్కరించి 'ఒక వ్యవహారంలో సలహాతీసుకోటానికి వచ్చా'నని చెప్పాడు. రామకిశోరబాబు ఆ వచ్చిన పెద్దమనిషిని ఎరగడు. అందుకనే నిస్సంకోచంగా 'లా విషయమైతే నేను ఫీజు తీసుకొంటానని తమకు తెలుసునా?' అన్నాడు.

'చిత్తం ఎంత చెల్లించుకోవల్సి ఉంటుంది?'

'ముప్పయి రూపాయలు.'

'సరే అలాగే తీసుకోండి.'

ఇద్దరూ ఆఫీసుగదిలోకి పోయి కూర్చున్నారు.

'మా బంధువుకు ఒక్కడే కొడుకు. వాడికి వివాహమై పదిసంవత్సరాలైంది. ఇంతవరకు సంతానం లేదు. ముందు కలుగుతుందన్న నమ్మకం కూడా తక్కువ' అన్నాడు పెద్దమనిషి.

'డాక్టరుకు చూపించారా?'

'ఆఁ-సంతానం కలగటం అసంభవమని ఆయన అభిప్రాయం.'

'కుర్రవాడు మంచి ఆరోగ్యవంతుడేనా?'

'ఆఁ-వాడికే జబ్బూ లేదు.'

'అయితే, ఏవిషయమై కావాలి నా సలహా?' అని, రామకిశోరబాబు పొడుంకాయలోనుంచి ఒక చిటికె నస్యం తీసాడు.

'ఇలా సంతానం లేకుండా వంశం నశించిపోయేటట్టయితే వాళ్ల ఆస్తి ఎవరికి చెందుతుంది?'

చిటికెడు పొడుముకూ రెండు ముక్కుల్లోకి పీల్చి ‘కుర్రవాడు గనక ఆరోగ్యవంతుడైతే అతను హాయిగా పెళ్ళిచేసుకోవచ్చు. హిందూ లా ప్రకారం ఏ అడ్డూ ఉండదు’ అన్నాడు రామకిశోరబాబు.

‘లేనిమాట నిజమే! చట్టం అడ్డులేకపోయినా మనం అన్నిపనులూ అన్నప్పుడల్లా చేయగలమా?’.

రామకిశోరబాబు నవ్వి—‘సెంటిమెంట్ ప్రకారం నడిస్తే ప్రపంచంలో పనులు జరుగుతా యటండీ! ఇలాంటిపాడు సెంటిమెంట్స్‌తోనే మనం మునిగిపోతున్నాము!’ అన్నాడు.

తర్వాత రామకిశోరబాబు సెంటిమెంటు ప్రకారం నడిస్తే ఎన్ని నష్టాలుంటాయో చిన్న ఉపన్యాసంలో చెప్పారు. బయటిమనస్సు వారికి ఉదాహరణలు సంపాదించిపెట్టింది. లోపలిమనస్సు కిక్కురుమనకుండా ఊరుకున్నది.

‘ఒకవేళ అతను కుర్రవాడికి పెళ్ళిచేయడనుకోండి; అప్పుడు ఆ ఆస్తి ఎవరికి పోతుంది?’ అన్నాడు ఆగంతుకుడు.

చట్టప్రకారం వారసులెవరో రామకిశోరబాబు గడగడ చెప్పివేశాడు. తర్వాత తన సొంత అభిప్రాయం కూడా చెప్పకుండా వదలలేదు:

‘కుర్రవాడికి మళ్ళీ పెళ్ళి చేసెయ్యండి. గొడ్రాలుతో ఎవరు సుఖపడతారు? పిల్లా జెల్లా లేకపోతే సంసారం శ్మశానంలాగా ఉంటుంది! చూడండి, నాకు ఉచితమని తోచింది మీకు చెప్పాను. మీ సెంటిమెంట్‌కు గనక కష్టంగా ఉంటే నన్ను క్షమించండి!’

‘ఎబ్బె, కష్టమేమీ లేదండి! తమరు నిర్మోహమాటస్థులనీ, క్లయింట్ల హితైషులనీ తెలిసే తమదగ్గరికి వచ్చాను.’

ఫీజిచ్చి పెద్దమనిషి వెళ్ళిపోయాడు.

* * *

నాలుగైదు రోజులు గడిచినాక ఒకనాటి మధ్యాహ్నం గుర్రపుబండి ఒకటి రామకిశోరబాబు వాకిట్లో నిలబడింది. బండీలోనుంచి ఒకయువతి దిగి ఇంట్లోకి పోయింది.

రామకిశోరబాబు భార్య పోయింది. ఇంటో ఆడవాళ్ళు లేరు. వంటవాడూ, నౌకర్లూ. మధ్యాహ్నం కాబట్టి పెద్దనౌకర్లెవరూ ఇంట్లోలేరు. కుర్రవాడొకడు ఇల్లు కనిపెట్టుకుని ఉన్నాడు. వాడే బండిలోనుంచి

పరుపూ, ట్రంకూ దించి ఇంట్లోకి తెచ్చాడు. ట్రంకుమీద పేరు 'సరోజినీదేవి' అని ఆచరణనుబట్టిచూస్తే కుర్రవాడు సరోజినీదేవిని నట్టుగా కనబడలేదు. పైగా ఆమె ఆచరణ కుర్రవాణ్ణి మరింత ఆశ్చ న్వితుణ్ణి చేసింది.

సరోజినీదేవి నట్టింట ట్రంకోపెట్టె వగైరాలు పెట్టించి 'బాబు గెక్కడ?' అని కుర్రవాణ్ణి అడిగింది.

'కోర్టుకు వెళ్ళారు.'

'ఎప్పుడొస్తారు?'

'తెలియదండీ నాకు.'

సరోజినీదేవి ట్రంకుమీద కూర్చున్నది-మూర్తీభవించిన విషాదంలాగా

* * *

రామకిశోరబాబు కోర్టునుంచి వచ్చి విస్తుపోయాడు.

'ఇదేమిటి, సరూ! కబురుచేయకుండా హఠాత్తుగా వచ్చావేం?'

'ఇక వాళ్ళ ఇంట్లోఉండడం నా కిష్టం లేదు!'

'ఎందుకని! అసలు సంగతేమిటి?'—కుమార్తె ప్రవర్తన తండ్రికి మ ఆశ్చర్యం కలగజేసింది—'నాకిష్టం లే దంటే—?'

'వాళ్లు అబ్బాయికి మారుపెళ్ళి చేస్తున్నారు! నువ్వుకూడా చేయ మన్నావటగా?'

'నేను చేయమన్నా నా! అంటే—?'

'వాళ్లు నువ్వు ఎరగని మనిషిని ఒక అతన్నిపంపి నీ అభిప్రాయ తెలుసుకున్నారట! కుర్రవాడికి మళ్లీ పెళ్ళిచేయుటమే మంచిదని నువ్వు-

నేపథ్యంలో ఉంటున్న రామకిశోరబాబు లోపలిమనస్సు బయట మనస్సు గొంతు పట్టుకున్నది. రామకిశోరబాబు అసహాయుడై తన ఏకై పుత్రిక ముఖంవంక దీనంగా చూస్తూ ఉండిపోయాడు.

'నిజంగా నువ్వు చెప్పావా నాన్నా?' అన్నది మళ్ళీ సరోజిని.

B. N. K. Press, Madras. Q. H. No. M. S. 100/B.
For Q. H. No. 401. Cat. D. 750 Copies. December, 1945.